శ్రీమతే రామానుజాయ నమః



శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన

# శ్రీరంగరాజస్తవము

## పూర్వశతకము

**( తాత్పర్యంతో, విశేషాలతో )**


వ్యాఖ్యాత

పండితరత్న, ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి



**11వ ఉభయవేదాంత పండితసభల జ్ఞాపిక**

**జనవరి, 2016**

సమర్పకులు

**శ్రీమతి పి. అలుమేలు మంగ, శ్రీమాన్ పి. గోపాలకృష్ణమూర్తి దంపతులు**

**( హైదరాబాద్ )**

# శ్రీరంగరాజస్తవం - శ్రీపరాశరభట్టర్
# (పూర్వశతకం)

తాత్పర్యం,విశేషాలు- పండితరత్న- ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

ప్రతులు : 500

ప్రకాశకులు : శ్రీమతి పి. అలుమేలు మంగ, శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తి



ఆవిష్కరణ
సందర్భము : 11వ ఉభయవేదాంత పండితసభలు

వేదిక : అహోబిలమఠం, కాంచీపురం

ముఖచిత్రం : శ్రీరంగమంగళమణి శ్రీరంగనాథుడు, శ్రీపరాశరభట్టర్

ఈ గ్రంథం, హైదరాబాద్ వాస్తవ్యులు,
భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠులు శ్రీమాన్ పి.గోపాలకృష్ణ మూర్తి
గారు భక్తితో సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో ముద్రింపబడింది.

ప్రతులకు : ఈ.ఏ. శింగరాచార్యులు,
18-3-58/7, శాంతినగర్, కె.టి.రోడ్
తిరుపతి-517 507, ఫోన్ : 9885003420

అక్షరయోజనము : శ్రీమతి జయలక్ష్మి మరియు
శ్రీచంద్రశేఖర్

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి

# విన్నపం

భగవద్రామానుజులు తమ శిష్యులలో 74 మందిని సింహాసనాధిపతులుగా చేసి విశిష్టాద్వైత సిద్ధాంతప్రచారం కోసం వారిని నియమించారు. వారంతా ఆసేతు హిమాచలం భారతావనిలో వ్యాపించి తరతరాలుగా సిద్ధాంతప్రచారాన్ని తమ కర్తవ్యంగా భావించి నిర్వహిస్తున్నారు. దీనితోపాటుగా గత శతాబ్దిలో పెంటపాడు (ప.గో.జిల్లా), కోరుకొండ (తూ.గో.జిల్లా), విజయనగరం, విశాఖపట్టణం, గుంటూరు, విజయవాడ, తెనాలి, చీరాల, బందరు, పాలకొల్లు, వరంగల్లు మొదలైన పలుచోట్ల పలువురు ధార్మికులు, ధార్మికసంస్థలు ముందుకువచ్చి సంప్రదాయ ప్రచారం కోసం ఉభయవేదాంత పండిత సభలను నిర్వహించారు. వీటిలో కొన్నిచోట్ల ఇపుడు సభలు జరుగకపోయినా, కోరుకొండ, విజయనగరం వంటి పలుచోట్ల ఇంకా కొనసాగడం హర్షణీయం. విజయవాడలో శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారు, కులపతులు శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు కలసి ప్రారంభించిన ఉభయవేదాంత పండిత సభలు సంప్రదాయ ప్రచారానికి ఎనలేని దీప్తిని కల్గించాయి, కల్గిస్తున్నాయి. ఈ సభలు ఈనాటికీ శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి మంగళాశాసనాలతో కొనసాగుతున్నాయి.

ఇవి అన్నీ ఒకఎత్తు అయితే, హైదరాబాద్ వాస్తవ్యులు, భాగవత శేఖరులైన శ్రీమాన్ పి. గోపాలకృష్ణమూర్తిగారు గత పది సంవత్సరాలుగా చేసే సంప్రదాయ సేవ నిరుపమానమైనది. నిస్స్వార్థమైనది. వీరు 2008వ సం॥ నుండి ప్రతియేడు పలుచోట్ల ఉభయవేదాంత పండిత సభలను పెద్దల, విజ్ఞుల సహాయ సహకారాలతో, మంగళాశాసనాలతో వారు మెచ్చే రీతిలో నిర్వహిస్తున్నారు. లక్షలాది రూపాయలను వెచ్చించి సత్గ్రంథాలను కొని వితరణ చేస్తున్నారు. ఎన్నో గ్రంథాలను ముద్రించడంలో ఆర్థికంగా తోడ్పడుతున్నారు. ఇప్పటికి పదిచోట్ల వీరు ఒంటిచేతితో ఎవ్వరి సహకారం తీసుకోకుండా విజయవంతంగా పండితసభలు నిర్వహించారు. వీరి ఈ సేవ సర్వదా సర్వథా శ్లాఘ్యమైనది.

ఈ ప్రయత్నంలో భాగంగా శ్రీమాన్ గోపాలకృష్ణమూర్తిగారు ఈ యేడు జనవరి 23వ తేది నుండి 25వ తేదీ వరకు పెరుమాళ్ కోయిల్ అనే పేరుతో సంప్రదాయంలో పిలువబడే కంచిలో 11వ ఉభయవేదాంత పండిత సభలను జరుపుతున్నారు. వీరు జరిపే ఈ పండితసభలలో ఒక సంప్రదాయగ్రంథం

చిహ్నికగా ప్రచురింపబడడం విధిగా కాకపోయినా అలవాటుగా వస్తున్నది. ఆ రీతిలోనే ఇపుడు కంచిలో జరుగపోయే సభల స్మారకంగా శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన శ్రీరంగరాజస్తవం - పూర్వశతక, ఉత్తర శతకాలు తాత్పర్య, సంగ్రహ విశేషాలతో ముద్రింపబడుతున్నది.

భగవద్రామానుజులు తిరుమలలో వేంచేసియున్న సమయంలో వేదార్థ సంగ్రహాన్ని రచిస్తూ "అశేష చిదచిద్వస్తు శేషిణే శేషశాయినే" అని అంటూ శ్రీరంగ నాథుని స్మరించారు. అదేవిధంగా శ్రీరంగంలో శ్రీభాష్యరచన చేసేటప్పుడు "బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా" అని శ్రీనివాసుని స్మరించారు. తిరుమలలో ఉండగా శ్రీరంగనాథుని స్మరణ, శ్రీరంగంలో ఉండగా వేంకటేశ్వరుని స్మరణ - అనే ఇది అర్చారూపంలోని ధర్మైక్యభావన. ఇటువంటి భావనతోనే ఇపుడు వరదరాజస్వామి సన్నిధిలో పండితసభలు జరిగే ఈ సమయంలో శ్రీరంగనాథుని స్తుతి అయిన శ్రీరంగరాజస్తవం ముద్రింపబడి భక్తులకు సమర్పింబడుతున్నది.

అత్యంత స్వల్పకాలంలో సిద్ధంచేయబడి ముద్రింపబడిన ఈ గ్రంథంలో నా అనవధానత వల్ల, అజ్ఞానం వల్ల చోటుచేసుకున్న దోషాలను సహృదయ పాఠకులు క్షమించి ఈ గ్రంథాన్ని ఆదరిస్తారని నమ్ముతున్నాను. ఈ గ్రంథ ముద్రణకు ఆర్థికంగా సహాయపడిన, మిత్రులు శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తిగారికి నా హార్దిక కృతజ్ఞతలను సమర్పించు కుంటున్నాను. వారి సంప్రదాయ కైంకర్యం నిరంతరం కొనసాగాలని మనసారా ఆశిస్తూ, ఆవిధంగా వారిని కటాక్షించవలసినదిగా అస్మత్ కులదైవం వేంకటాచల పతిని ప్రార్థిస్తున్నాను. స్వస్తి.

జయతు జయతు రంగీ వేదవేద్యో రమేశః
జయతు జయతు భవ్యం దర్శనం శ్రీయతీందోః ।
జయతు జయతు ధీమాన్ భట్టపాదో మహాత్మా
జయతు కృతిరియం శ్రీరంగరాజస్తవాఖ్యా ॥

యతివరమతప్రచారే కృతదృఢదీక్షో జయతు తరామ్ శ్రీమాన్।
గోపాలకృష్ణమూర్తిః సకుటుంబోయం కృతీ ధన్యః ॥

తిరుపతి — ఇట్లు నివేదించు భాగవతదాసుడు

21-1-2016 — ఈ.ఏ. శింగరాచార్యులు

# శ్రీపరాశరభట్టర్ జన్మాదికములు

భగవద్రామానుజుల శిష్యులలో అగ్రగణ్యులు, వారికి పవిత్రస్థానీయులు, ''నడమునట్టి పతంజలి''గా పేరుపొందిన కూరేశులకు శ్రీరంగనాథుని అనుగ్రహమువలన జన్మించిన కవలలు అగు పుత్రులు ఇరువురిలో శ్రీపరాశరభట్టర్ మొదటివారు. రెండవ కుమారులు వేదవ్యాసభట్టర్‌గా ప్రసిద్ధులగు శ్రీరామప్పిళ్లై, వీరిద్దఱకు ఈ పేర్లను శ్రీరామానుజులు అనుగ్రహించిరని, ఇట్లు ఆ పేర్లను వారికి పెట్టుట ద్వారా తమ ఆచార్యులగు యామునుల కోరికను తీర్చిరను ఐతిహ్యము చరిత్ర ప్రబంధములలో ప్రసిద్ధము. కూరేశులు కాంచీపురమునకు దగ్గరలోగల ''కూర''మను అగ్రహారమునకు అధిపతులు. అపారమైన తమ సంపదను అంతటిని తృణప్రాయముగా త్యజించి, రామానుజుల పాదములను ఆశ్రయించిరి. వారికి ఏమాత్రము తీసిపోని ఆత్మగుణసంపదను కల్గిన ''ఆణ్డాళ్'' అను సతీమణి వారి ధర్మపత్ని. కూరేశుల తండ్రిపేరు దామోదరులని, శ్రీరామమిశ్రులని, అనంతసూరి అని పలు విధములుగా గ్రంథములలో కనుపించుచున్నది. భట్టరు హరీత గోత్రులు, ఆపస్తంబసూత్రులు, తైత్తిరీయశాఖకు చెందినవారు. వీరిది వడమకులము.

శ్రీభట్టర్ జన్మించిన సంవత్సరము శుభకృత్ అని పలుచోట్ల కనుపించుచున్నది. విరోధికృత్ అని కొందఱు తలచుచున్నారు. శుభకృత్ నామ సంవత్సరమని తలచిన, ఆ సంవత్సరము క్రీ. శ. 1062వ సం॥ముతో కాని, 1122వ సం॥ము తో కాని సమానమగును. భగవద్రామానుజులు 1017 నుండి 1137 వరకు అనగా 120 సం॥లు జీవించిరని సంప్రదాయజ్ఞులతోపాటు పలువురు చరిత్రకారులును అంగీకరించుచున్నారు. శ్రీరామానుజులు పరమపదించు సమయమునకు భట్టరు వయస్సు యౌవనదశకు మించి యుండుటకు అవకాశము కన్పించుటలేదు. కావున భట్టరు జన్మించిన సంవత్సరము క్రీ.శ. 1122గా అంగీకరించుటయే తగినదని తోచుచున్నది. భట్టరు వృషభమాసము (వైశాఖమాసము) అనూరాధానక్షత్రమున జనించిరని పలువురు అభిప్రాయపడుచున్నారు. వీరి జీవితకాలమునుగూర్చి పండిత పరిశోధకులలో భిన్నాభిప్రాయములు కలవు. పెక్కు ఆధారములనుబట్టి ఈ ఆచార్యులు సుమారు 60 సం॥ల కాలము జీవించియుండిరని తోచుచున్నదని ఉ.వే. శ్రీమాన్ డా॥ M.A. వేంకటకృష్ణన్‌గారు, ఉ.వే.S.శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ మొదలగు పండితుల అభిప్రాయము.

బాల్యమునుండి భట్టర్ ప్రదర్శించిన మేథావిలాసము అనితరసాధారణము. చిన్నతనములోనే ప్రసిద్ధపండితుడగు సర్వజ్ఞభట్టును ఓడించుట, ''శిఱుమామనిశర్'' అను తిరువాయ్‌మొழி సూక్తినిగూర్చి కూరేశులను ప్రశ్నించుట, (ఈ విషయము వరివస్య రెండవ పేజీలో వివరింపబడినది.) శ్రీరామానుజుల ఆజ్ఞను అనుసరించి, మేల్‌నాట్టులోని మాధవసూరి అను పేరుకల (తరువాతి కాలము నఞ్జీయర్‌గా ప్రసిద్ధులు) వేదాంతిని పరాజితుని చేయుట, శ్రీరామానుజులు తమకు పిమ్మట దర్శననిర్వాహకులు భట్టరేనని తెలుపుట మొదలగు సందర్భములు ఈ ఆచార్యుల జ్ఞానాధిక్యమును, బుద్ధివైశద్యమును నిరూపించుచున్నవి.

శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకియు భట్టర్‌ను తమ పుత్రునిగా స్వీకరించిరని గురు పరంపరాప్రభావాది గ్రంథములలో కలదు. వీరికి కూరేశులు పెట్టినపేరు శ్రీరంగనాథుడు. ఈవిషయము భగవద్గుణదర్పణములోని మొదటి శ్లోకమువలన తెలియుచున్నది. వీరు తిరువరంగప్పెరుమాళ్ భట్టర్, పెరియభట్టర్, భట్టర్ మొదలగుపేర్లతో కూడ ప్రసిద్ధులు. శ్రీరంగేశపురోహితులు, వేదాంతాచార్యభట్టర్, పరవాదిమదహస్తిపంచాననులు, మొదలగు బిరుదములు వీరికి కలవు. వీరి భార్య మన్నియమ్మాళ్. కుమారులు ఉద్దండభట్టు. ఇష్టదైవము అళ్లకియ శిఙ్గర్ (నృసింహమూర్తి). వీరికి రామావతారమున పక్షపాతము మెండు. భట్టరు ఆచార్యులు ఎమ్బార్, కూరేశులును. ఎమ్బార్ పంచసంస్కారములనొనర్చిరి. శ్రీరామానుజులు సాక్షాత్ ఆచార్యులు కాకున్నను, తమను వారి శిష్యులుగా భట్టరు తలచిరి. వీరిని ఆశ్రయించిన వారిలో నఞ్జీయర్, అమ్మఙ్గి ఆళ్వాన్, వీరశిఖామణి పల్లవరాయలు, నమ్బిగోవర్ధనదాసు మొదలగువారు.

**శ్రీరంగరాజస్తవమును భట్టర్ రచించిన సందర్భము :-**

ఆ కాలమున చోళదేశమును పాలించు వీరసుందరబ్రహ్మరాయుడు (అకలంక బ్రహ్మరాయుడు) కూరేశుల శిష్యుడు. శ్రీరంగములోని ప్రాకారమొకటి జీర్ణమగుటచే, తిరిగి నిర్మింపనెంచిన అందులకు అడ్డముగానున్న పిళ్లైప్పిళ్లై ఆళ్వాన్ అను ఆచార్యుల గృహమును తొలగింపనెంచెను. అట్లు చేయుట తగదని భట్టరు తెలిపినను, ఆచార్యుల పుత్రులను గౌరవమునుకూడ బ్రహ్మరాయుడు చూపక వారి మాటలను ధిక్కరించెను. అతడొనర్చిన అసహ్యమైన భాగవతాపచారమునకు క్లేశపడిన భట్టరు శ్రీరంగమున నివసింపలేక, తిరుక్కోట్టియూర్‌కు (గోష్ఠీపురమునకు) చేరిరి. కొంతకాలమైన పిదప బ్రహ్మరాయుడు మరణించెనని తెలిసి, తిరిగి శ్రీరంగమునకు వచ్చుచు, ఆ సమయమున తమకు కల్గిన అనుభవమును శ్రీరంగరాజస్తవరూపమున ప్రకటించిరట. ఈ వృత్తాంతమును శ్రీ. ప్ర. భ. అణ్ణంగరాచార్యస్వామి తమ వ్యాఖ్యానప్రారంభమున ''శ్రీగోష్ఠీనగరాత్ నివృత్తిసమయే సంతోషవైశద్యతః శ్రీభట్టార్యగురూత్తమో గుణనిధిః శ్రీరంగరాజస్తవమ్, దివ్యం యం రచయాంబభూవ'' అనుచు పేర్కొనిరి.

**శ్రీరంగరాజస్తవము :-**

పూర్వోత్తర శతకములుగా విభాగింపబడిన ఈ స్తోత్రము ద్వయమంత్రమునకు వివరణమని ఆచార్యుల తలంపు. అర్చామూర్తులన్నిటిలో అతిప్రాచీనమైనదిగా, మూలకందముగా భావింపబడు శ్రీరంగనాథుని అర్చామూర్తిని స్తుతించుచు రచింపబడిన ఈ స్తోత్రము శ్రీవైష్ణవస్తోత్రవాఙ్మయమున ప్రధానస్థానమును అలంకరించుటలో ఆశ్చర్యమేమున్నది! శ్రీయామునుల స్తోత్రరత్నము శ్రీరంగనాథునిగూర్చియేనని (''కులధనం, కులదైవతం'' అని యుండుటను బట్టి) ఆచార్యులు తలంచినను, అందు స్పష్టముగా శ్రీరంగనాథుని పేరు ఉట్టంకింపబడలేదు. అట్లు శ్రీరంగనాథుని నామము ఉట్టంకింపబడిన స్తోత్రములలో ఇది

మొట్టమొదటిది. కూరేశులు మొదటగా శ్రీరంగనాయకీ స్తుతిని (శ్రీస్తుతిని) రచింపగా, వారి కుమారులగు భట్టరు శ్రీరంగనాథుని మొదటి స్తోత్రమును రచించిరి.

పూర్వశతకమున 127 శ్లోకములు, ఉత్తరశతకమున 105 శ్లోకములను కలవు. ఇందలి ప్రమేయమును ఈ క్రింది విధముగా విభాగింపవచ్చును.

**పూర్వశతకము**

| శ్లోకసంఖ్య | | పరిమితి | విషయము |
|---|---|---|---|
| 1-12 | = | 12 | గురుపరంపరావందనము |
| 13-19 | = | 07 | స్తుతిని రచించుటలో తమకు శక్తి లేదనుచు భట్టరు వినయమును ప్రదర్శించుట |
| 20-24 | = | 05 | కావేరీనది వర్ణన |
| 25-32 | = | 08 | శ్రీరంగద్వీపము, ఉద్యానవనములు, శ్రీరంగనగరముల వర్ణన, నగరపాలకుల వందనము. |
| 33-62 | = | 30 | శ్రీరంగములోని మంటపము, వేయికాళ్లమండపము, చంద్రపుష్కరిణి, పున్నాగవృక్షముల వర్ణన, పరమపదనాథుని సన్నిధిలోని పదిమంది ఆళ్వార్లను, శ్రీరంగవిమానమును, విష్వక్సేనులను, సూత్రవతిని, ద్వారపాలకులను, గరుడుని, తత్పుత్రులను, పంచాయుధములను, సుదర్శనమును, హనుమద్విభీషణులను, వేత్రవరమును, ఆమోదస్తంభములను, చామరగ్రాహిణులను ఆశ్రయించుట. |
| 63-76 | = | 14 | శ్రీరంగనాథుని ఉత్సవమూర్తి వర్ణన. |
| 77-127 | = | 51 | మూలమూర్తి వర్ణన |
| మొత్తం | = | 127 | |

**శ్రీరంగరాజస్తవము - ద్వయమంత్ర వివరణము :-**

నమ్మాళ్వార్లచే ప్రణీతమైన తిరువాయ్‌మొళ్లికి తనియన్ (ప్రార్థనా పాశురము)ను అనుగ్రహించు భట్టరు ''వాన్ తిక్ళుమ్ శోలై మదిళరఙ్గర్ వణ్పుకళ్మేల్ ఆన్టతమిళ్మఱైక ళాయిరముమ్'' అనుచు ఆ ప్రబంధము శ్రీరంగనాథుని గూర్చి రచింపబడినదనిరి. తిరువాయ్‌మొళ్లి ప్రబంధము ద్వయమంత్రమును వివరించుచున్నదని పూర్వాచార్యు లందఱి అభిప్రాయము. మొదటి మూడు శతకములలో ఉత్తరఖండార్థము, పిమ్మట మూడు శతకము

లలో పూర్వ ఖండార్థమును వివరింపబడినదని సంప్రదాయము. శ్రీరంగనాథుని స్తుతించు ఈ స్తోత్రమును భట్టరు ద్వయమంత్ర వివరణరూపముగా రచించిరని అభిజ్ఞులగు ఆచార్యులు, వ్యాఖ్యాతలును అభిప్రాయపడిరి. దీని వివరణము శ్రీ వేంకటాచార్యవ్యాఖ్యానమున తెలుపబడినది. భట్టరు అష్టశ్లోకిలో ''నేతృత్వం'' అను శ్లోకమున ద్వయమంత్రమున పది జ్ఞాతవ్యార్థములు కలవని పల్కిరి. ఆ అర్థములు శ్రీరంగరాజస్తవమున వివరింపబడుటను ఈ క్రింది విధముగా చూపవచ్చును.

**పూర్వశతకము - పూర్వఖండార్థము :-**

(1) శ్రీ :- నేతృత్వం - అనగా లక్ష్మీపురుషకారత్వము - ఈ అర్థము ''యద్భ్రూవిభ్రమ భేదతః ఈశేశితవ్యం'', ''స్తనస్తబకచంచలః శ్రీరంగరాజభృంగః'' ఇత్యాదులచే సూచింపబడినది.

(2) మత్ :- (దివ్యదంపతుల) నిత్యయోగం - ''లక్ష్మీపదలాక్షైకలక్షణమ్'', ''శ్రీస్తనకస్తూరీమకరీముద్రితోరసః'' - ఇత్యాదులచే ఈ అర్థము తెలుపబడినది.

(3) నారాయణ :- సముచితగుణజాతం - అనగా వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, జ్ఞానశక్త్యాదులు - 87, 88, 90 మొదలగు శ్లోకములలో వివరింపబడినవి.

(4) చరణౌ :- తనుఖ్యాపనం - దివ్యమంగళవిగ్రహప్రకాశనము - పూర్వశతకములోని 63వ శ్లోకమునుండి - 123వ శ్లోకము వఱకు తెలుపబడినది.

(5) శరణం :- ఉపాయం - ''పాదపద్మౌ మనసై నసై చ'', ''పాదపంకజయుగం వందామహే'', ''శ్రీరంగేందోః పదకిసలయే వందే'' అనుటచే సూచింపబడినది.

(6) ప్రపద్యే :- కర్తవ్యభాగం - అనగా చేతనుని అధ్యవసాయము - ''శ్రీరంగిణః పదం నః మంగళం వహతు'', ''శ్రీరంగేశయ మాశ్రయే'' ఇత్యాదులచే తెలుపబడినది.

**ఉత్తరశతకము - ఉత్తరఖండార్థము :-**

(1) శ్రీమతే :- ప్రాప్యం మిథునపరం - ''లక్ష్మీనేత్రా త్వయా'', ''స్వముద్దిశ్య శ్రీమాన్ ఇతి నదతి వాగౌపనిషదీ'', ''లక్ష్మ్యా సహ త్వాం పశ్యేమ'' ఇత్యాదులయందు సూచింపబడినది.

(2) నారాయణ :- స్వామిత్వం (తన్మూలకములగు వాత్సల్య సౌశీల్యసౌలభ్యాదులు) - అవతారములను వర్ణించు శ్లోకములు. 45నుండి 73వ శ్లోకము వరకు.

(3) ఆయ (చతుర్థీ) :- ప్రార్థనాం (కైంకర్యప్రార్థన) ''త్వాం శరద శ్శతం పశ్యేమ'', ''శ్రీరంగనాథం త ముపాసిషీయ'', ''స సన్ యజే జ్ఞానమయైః మఖైః'', ''పరస్మై బ్రహ్మణే ఏనం ప్రత్యంచం యునజ్మి'' ఇత్యాదులచే ఈ అర్థము సూచింపబడినది.

(4) నమః - ప్రబలతరనిరోధిప్రహాణం :- (ప్రాప్యవిరోధినిరసనము) ''అసౌ దుఃఖం సుఖయతి ఇతి మాం దయస్వ'', ''భృశనిమ్న మిమం జన మున్నమయ'' ఇత్యాదులచే తెలుపబడినది.

**శ్రీరంగరాజస్తవము - అర్థపంచకము :-**

భట్టరు తిరువాయ్‌మొழி కి తనియన్‌గా రచించిన ''మిక్క-విఱై నిలైయుమ్ మెయ్యా ముయర్ నిలైయుమ్ ...'' అను పాశురమున ఆ ప్రబంధమున అర్థపంచక వివరణము ప్రమేయ మనిరి. శ్రీరంగనాథుని గూర్చి పాయింపబడిన తిరువాయ్‌మొழி అర్థపంచకమును వివరించునట్లే, ఆ స్వామి విషయమున భట్టర్‌చే రచింపబడిన ప్రస్తుతస్తవమున కూడ అర్థపంచకము ప్రతిపాదింపబడినదనుటలో సందేహములేదు. ఆ విషయ మిచట స్థాలీపులాకముగా తెలుపబడుచున్నది.

(A) స్వస్వరూపము :- (జీవాత్మస్వరూపము)

(a) ''వపుః అవయవితయా ఇదంకుర్వాణైః బహిష్కరణైః నిరవయవకః అహంకారార్థః కరణాతిగః పుమాన్ స్ఫురతి హి'' (4వ శ్లో.ఉ.శ.) (శరీరము అవయవములను కల్గినదగుటచే, ఇది అని వేరుచేయు బాహ్యేంద్రియములచే అవయవములులేని, అహం అను ప్రతీతికి అర్థుడగు, ఇంద్రియాతీతుడగు పురుషుడు తోచుచున్నాడు కదా!)- అనుటచే ఆత్మదేహము కంటె వేరయినది, అణువు, బాహ్యేంద్రియములకు గోచరము కానిది.

(b) ''అహ మిద మభి వేద్మీతి ఆత్మవిత్త్యోః విభేదే స్ఫురతి'' (10వ శ్లో) - (నేను దీనిని తెలిసికొనుచున్నాను అని ఆత్మ-జ్ఞానముల భేదము తోచుచుండగా) అనుటచే ఆత్మ-జ్ఞానముకన్న విలక్షణమయినది.

(c) ''ప్రళయసీమని అచిదవిశేషితాన్'' (41వ శ్లో) - (ప్రళయమున అచిత్తుకంటె విశేషములేని పలుజీవులను) - అనుటచే ఆత్మల అనేకత్వము,

(d) ''యస్యాస్మి పత్యుః'' (81వ శ్లో) - (ఏ స్వామికి దాసుడనైతినో) అనుటవలన అనన్యార్హశేషత్వము,

(e) ''రంగనిధే త్వమేవ పాహి'' (88వ శ్లో) (శ్రీరంగనాథా ! నీవే రక్షింపుము) - అనుటచే అనన్యశరణత్వము,

(f) ''పరస్మై బ్రహ్మణే మహసే అస్మై తదర్థం ప్రత్యంచం మాం ఏనం యునజ్మి'' (82వ శ్లో.) (పరబ్రహ్మయు, తేజోరూపియు అగు శ్రీరంగనాథుని కొఱకు ప్రత్యగాత్మ అగు ఈ నన్ను కూర్చుకొనుచున్నాను) అనుటచే అనన్యభోగ్యత్వము,

(g) ''జ్ఞానక్రియాభజనసంపదకించనోఽహమ్'' (89వ శ్లో) - (జ్ఞానకర్మభక్తిసంపదలను ఏమియు లేని నేను) అనుటవలన ఆకించన్యము,

(h) ''స్వభావదాస్యేన చ'' (81వ శ్లో) (సహజదాస్యముచే) అనుటచే ఆత్మల సహజదాస్యము,

(i) ''తే శేషోఽశేషః ప్రపంచః వపుః'' (24వ శ్లో) (''ఈ సమస్త ప్రపంచము నీకు శేషము, శరీరమును'') అనుటచే ఆత్మలు భగవానునకు శరీరము,

(j) ''అప్రాతసహజదాస్యాః'' అను శ్లోకమున నిత్య-ముక్త-ముముక్షు (బద్ధ) భేదము. ఇట్లు పలువిధములుగ జీవస్వరూపము వివరింపబడినది.

(B) పరస్వరూపము :- (పరమాత్మస్వరూపము)

(a) ''స్వ ముద్దిశ్య శ్రీమాన్'', (87వ శ్లో) ''లక్ష్మీపదలాక్షైక లక్షణమ్'', ''శ్రీస్తనకస్తూరీ మకరీముద్రితోరసః'' - ఇత్యాదులచే శ్రియఃపతిత్వము,

(b) పూర్వోత్తర శతకములలోని పలుశ్లోకములు భగవానుని కల్యాణగుణాకరత్వము,

(c) ''త్వాం పుండరీకేక్షణ మామనంతి'' - అనుటచే పుండరీకాక్షత్వము,

(d) ''శ్రీరంగక్రమ కలభం'' - అనుటచే నిరంకుశస్వాతంత్ర్యము (కలభసామ్యముచే),

(e) ''ఉపాయోపేయత్వే తదిహ తత్వం'', ''త్వయి సతి పురుషార్థే''- ఇత్యాదులచే ఉపాయత్వము, ఉపేయత్వమును,

(f) ''ఆత్మా ఉస్యగంతుః పరితస్థుష శ్చ'' (స్థావరజంగమములకు ఆత్మ)-అనుటచే జగచ్ఛరీరకత్వము,

(g) ''ప్రళయసమయసుప్తం... క్రీడసి శ్రీసమక్షం''- అను శ్లోకమున సృష్టి స్థితిలయకారకత్వము,

(h) ''ఆర్తిం తితీర్షు రథ రంగపతే ధనాయన్''-అను శ్లోకమున చతుర్విధపురుషార్థ-ప్రదాయకత్వము,

(i) ''రత్నమివ'' (27), ''మహసే'' (82) - అనుటచే స్వయంప్రకాశకత్వమును తెలుపబడినవి.

(j) ప్రరత్వాదిపంచకము :-

(1) ''యద్విష్ణోః పదం (పూ.శ.-26), పరము,
శ్రీమద్వ్యోమ న సీమ వాఙ్మనసయోః''

(2) ''షాడ్గుణ్యాత్ వాసుదేవః'' (ఉశ - 39) - వ్యూహము,

(3) ''స్థిత్యుత్పత్తిప్రవృత్తిగ్రసననియమన -అంతర్యామిత్వము, వ్యాప్నై రాత్మన స్తే''

(4) ఉత్తరశతకములోని 60వ శ్లోకమునుండి - 73వ శ్లోకము వరకు - అవతారములు (విభవము),

(5) ''అర్చ్యః సర్వసహిష్ణుః'' - (ఉ.శ. 74) - అర్చారూపములు తెలుపబడినవి.

(C) ఉపాయస్వరూపము :- ''తన భరోఽహ మకారిషి ధార్మికైః శరణ మిత్యపి వాచ ముదైరిరమ్'' (102) (నేను ధార్మికులగు ఆచార్యులచే నీకు భారమై చేయబడితిని, శరణమను మాటను పలికితిని) ఇత్యాదులచే ఆచార్యముఖముగా సమాశ్రయణము, ''రంగేశ్వర త్వాం శరణం ప్రపద్యే'' ఇత్యాదులచే శరణవరణము.

(D) ఉపేయస్వరూపము :- ''యోఽహ మస్మి స సన్ యజే జ్ఞానమయైః మఖైః'', ''ప్రత్యంచ మేనం యునజై పరస్మై'', ''లక్ష్మా సహ త్వాం శరదశ్శతం పశ్యేమ'' - ఇత్యాదులచే భగవానుని నిత్యకైంకర్యము ఉపేయమని తెలుపబడినది.

(E) విరోధిస్వరూపము :-

(a) దేహాత్మాభిమానస్వస్వాతంత్ర్యరూపస్వరూపవిరోధి-''జనమఖిల మహంయుః''(90), ''అహం భవామి'' (101) అనుటచే తెలుపబడినది.

(b) ''త్వా మపి విస్రంభవివేకరేకాత్ అపాస్య'' అనుటచే అర్చావతారమున అశక్తియోగప్రతిపత్తి అనబడు పరత్వవిరోధి సూచింపబడినది.

(c) ''ప్రకుపితభుజగఫణానా మివ విషయాణా మహం ఛాయామ్'' అనుటవలన పురుషాంతరములలోని ఇచ్ఛ అను పురుషార్థవిరోధి తెలుపబడినది.

(d) ''మయి గుణపరమాణాాదంతచింతాభిజ్ఞే'' (97) ఇత్యాదులచే విరోధిబాహుళ్యము అను ఉపాయవిరోధి,

(e) ''అతిక్రామన్ ఆజ్ఞాం తవ విధినిషేధేషు, భవతేఽపి భక్తాయ అభిద్రుహ్యన్'' (91)- ఇత్యాదులచే భగవద్భాగవతాపచారమనబడు ప్రాప్తి (అనుభవ) విరోధియు సూచింపబడినవి.

ఇట్లు శ్రీరంగరాజస్తవమున అర్థపంచక ప్రతిపాదకము.

**శ్రీరంగనాథుని పలువిధములుగా రూపణము చేయుట :**

భట్టరు శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుని పలువిధముగా రూపణము చేసిరి. ఇవి అన్నియు చాల వరకు ఆళ్వార్ల దివ్యసూక్తులను అనుసరించియే చేయబడినవనుట వరివస్యలో ఆయా శ్లోకముల వివరణలో నిరూపింపబడినవి. భట్టరు చేసిన రూపణముల వివరము ఈ క్రింద చూపబడినవి.

| | | | |
|---|---|---|---|
| (1) | చంద్రుడు | - | 11, 14 50వ శ్లో. (పూ.శ.) |
| (2) | భృంగము | - | 10వ శ్లో. (పూ.శ.) |
| (3) | కలభము (గున్న ఏనుగు) | - | 16వ శ్లో. (పూ.శ.) |
| (4) | ధనము | - | 76వ శ్లో. (పూ.శ.) |

| | | | |
|---|---|---|---|
| (5) | వషట్కృతము | - | 99వ శ్లో. (పూ.శ.) |
| (6) | తటాకము | - | 63, 64, 65వ శ్లో. (పూ.శ.) |
| (7) | కాందిశీకుడు | - | 58వ శ్లో. (పూ.శ.) |
| (8) | కల్పవృక్షము | - | 76వ శ్లో. (పూ.శ.) |
| (9) | కామధేనువు | - | 76వ శ్లో. (పూ.శ.) |
| (10) | వర్తకుడు | - | 88వ శ్లో. (ఉ.శ.) |
| (11) | క్ష్మాతలము | - | 76వ శ్లో. (పూ.శ.) |
| (12) | రత్నాపణము | - | 36వ శ్లో. (ఉ.శ.) |
| (13) | సముద్రము | - | 80, 102, 117వ శ్లో. (ఉ.శ.) |
| (14) | ఊర్ణనాభి | - | 31వ శ్లో. (ఉ.శ.) |
| (15) | కుంజరము | - | 80, 118వ శ్లో. (ఉ.శ.) |
| (16) | అర్ణవతర్ణకము | - | 81, 54వ శ్లో. (ఉ.శ.) |
| (17) | నందనవనము | - | 84వ శ్లో. (పూ.శ.) |
| (18) | మరకతమణి | - | 86వ శ్లో. (పూ.శ.) |
| (19) | కాలమేఘము | - | 82వ శ్లో. (పూ.శ.) |
| (20) | జనని | - | 45వ శ్లో. (ఉ.శ.) |
| (21) | రత్నము | - | 27వ శ్లో. (ఉ.శ.) |
| (22) | కస్తూరి | - | 33వ శ్లో. (ఉ.శ.) |
| (23) | శిఖి | - | 44వ శ్లో. (ఉ.శ.) |
| (24) | సుహృత్ | - | 47వ శ్లో. (ఉ.శ.) |
| (25) | చింతామణి | - | 8వ శ్లో. (పూ.శ.) |
| (26) | అమృతప్రవాహము | - | 75, 83వ శ్లో. (పూ.శ.) |
| (27) | నేత్రము | - | 75వ శ్లో. (పూ.శ.) |
| (28) | జీవితము (అసువులు) | - | 75వ శ్లో. (పూ.శ),66వ శ్లో. (పూ.శ) |

ఈ స్తోత్రములోని పాఠభేదములకు, అలంకారములకు, ఛందస్సునకు, పదప్రయోగములకు సంబంధించిన విశేషములు ఆయా శ్లోకముల వ్యాఖ్యలో వివరింపబడుటచే ఇచట మరల ప్రస్తావింపబడుటలేదు.

**శ్రీరంగరాజస్తవములోని వృత్తవైవిధ్యము :-**

శ్రీరంగరాజస్తవమునకు సంస్కృత వ్యాఖ్యానమును రచించిన శ్రీరామానుజాచార్యులు తమ వ్యాఖ్యాప్రారంభమున ''నానావృత్త శ్లోకభంగ్యా ప్రవృత్తం'' అనుచు భట్టర్ చూపిన వృత్తవైవిధ్యమునుగూర్చి ప్రస్తుతించిరి. ఈ స్తోత్రమున ప్రయోగింపబడిన పలు వృత్తములు సందర్భోచితిని కల్గియున్నవను అంశము ఆయా శ్లోకవ్యాఖ్యానమున వివరింపబడినది. ప్రస్తుతము మఱికొన్ని ఛందోవిశేషములు తెలుపబడుచున్నవి. శ్రీరంగరాజస్తవ పూర్వోత్తరశతకములలోని వృత్తములను పరిశీలించిన, భట్టరు అన్ని విధములైన వృత్తములను- అనగా, మాత్రా, సమ, అర్ధసమ, విషమ వృత్తములను ఉపయోగించినట్లు వ్యక్తమగును. మొత్తము మీద రెండు శతకములలో 41 విధములైన వివిధ వృత్తములు ఉపయోగింపబడినవి. వీనిలో కొన్ని అపూర్వములైనవి. ఉత్తరశతకములోని 60వ, 61వ శ్లోకములలో బేసిపాదములు రుక్మవతీ వృత్తమున (అనగా భ, మ, స, గ అను గణములతో), సరిపాదములలో మణిగణకిరణవృత్తమున (అనగా న, న, న, న, స అను గణములతో) రచింపబడినవి. అనగా ఇది అర్ధసమవృత్తభేదము. ఈ వృత్తము వృత్తరత్నాకరాదిగ్రంథములలో కన్పించుటలేదు. ఉత్తరశతకములోని 50వ శ్లోకము ''య, భ, త, గగ'' అను గణములతోకూడిన సమవృత్తభేదము. ఇదియు ఛందోగ్రంథములలో కానవచ్చుటలేదు. ఇట్లే, పుష్పితాగ్ర, మాలభారిణివంటి మఱికొన్ని సమవృత్తభేదములును కలవు. ఉత్తరశతకములోని 34వ శ్లోకము ''ఉద్గత'' అను విషమవృత్తజాతికి చెందినది. ఈ వృత్తమున మొదటిపాదమున ''స, జ, స, ల'' అను గణములు, రెండవపాదమున ''న, స, జ, గ'' అను గణములు, మూడవపాదమున ''భ, న, జ, ల గ'' అను గణములు, నాల్గవపాదమున ''స,జ, స, జ, గ'' అను గణములు ఉండును. పూర్వశతకములోని 86వ శ్లోకము ''మణిగణకిరణ''మను వృత్తభేదము. ఇందు ఈ వృత్తము పేరు ముద్రాలంకారపద్ధతిలో సూచింపబడినది. అరుదుగా కన్పించు మత్త, ద్రుత మధ్య, వియోగిని, కుసుమలతావేల్లిత, కోకిలకము ప్రమాణిక, రుచిర, ప్రమితాక్షర వంటి వృత్తములును ఈ స్తోత్రమున ప్రయోగింపబడినవి. వాణి, బాల, ఆర్ద్ర, కీర్తి, బుద్ధి, రామ, మాల వంటి ఉపజాతివిశేషములు, మాత్రా ఛందస్సునకు చెందిన ఆర్యావృత్తమును కలవు. ఇట్లు శ్రీరంగరాజస్తవమున భట్టరు ప్రదర్శించిన ఛందోవిషయకవైశిష్ట్యము అనితరసాధారణమైనది. ప్రస్తుతము ఈ స్తవమున ప్రయోగింపబడిన వృత్తముల వివరములు ఈ క్రింద చూపబడుచున్నవి.

(1) ఆర్య - 59, 61, 101, 122 - పూ.శ. 92, 100 ఉ.శ.
(2) అనుష్టుప్ - 1-12 పూ.శ., 99 ఉ.శ.
(3) ప్రమాణిక - 91 పూ.శ.
(4) మంజుభాషిణి - 13, 14, 94 పూ.శ.

| | | | |
|---|---|---|---|
| (5) | వసంతతిలక (ఉద్ధర్షిణి, సింహోన్నత) | - | 15, 17, 18, 34, 37, 42, 48, 49, 50, 63, 65, 66, 67, 69, 71, 73, 82, 83, 85, 87, 120. - పూ.శ. 1, 27, 42, 51, 71, 83, 89. - ఉ.శ. |
| (6) | ఇంద్రవజ్ర | - | 16, 35, 38, 123 పూ.శ., 2, 79, 80, 82, 93, 95, 105 - ఉ.శ. |
| (7) | శార్దూలము | - | 20, 21, 22, 70, 72, 74, 76, 108, 112, 124, 125 - పూ.శ. 5, 12, 17, 21, 23, 38, 43, 55, 70, 72, 74, 75, 76 - ఉ.శ. |
| (8) | హరిణి | - | 23, 39, 52, 79, 103, 104, 106, 115-పూ.శ. 4, 63, 64, 69, 77 - ఉ.శ. |
| (9) | మాలిని | - | 24, 25, 28, 33, 45, 47, 53, 64, 68, 80, 102, 111 - పూ.శ. 6, 10, 13, 28, 44, 47, 48, 86, 90, 97 - ఉ.శ. |
| (10) | ప్రహర్షిణి | - | 26, 27, 81 - పూ.శ. - 3, 22, 59 - ఉ.శ. |
| (11) | పుష్పితాగ్ర | - | 29, 30, 31, 32, 62, 118-పూ.శ. 49, 54-ఉ.శ. |
| (12) | తోటకము | - | 36 - పూ.శ. 104 - ఉ.శ. |
| (13) | స్వాగత | - | 46, 88 - పూ.శ. 53 - ఉ.శ. |
| (14) | రుక్మవతి | - | 51 - పూ.శ. |
| (15) | శిఖరిణి | - | 44, 90, 92, 99, 105, 109, 110, 116-పూ.శ. 7, 20, 37, 62, 65, 66, 68, 87, 91, 103-ఉ.శ. |
| (16) | ఉపజాతి | - | 40, 41, 43, 58 - పూ.శ. 78, 81, 101 - ఉ.శ. |
| (17) | రథోద్ధత | - | 54 - పూ.శ. |
| (18) | స్రగ్విణి | - | 55 - ఉ.శ. |
| (19) | శాలిని | - | 56, 60, 121 పూ.శ. - 85, 94 - ఉ.శ. |
| (20) | మేఘవితానము | - | 57 పూ.శ. |
| (21) | స్రగ్ధర | - | 19, 75 - పూ.శ. 14, 15, 18, 19, 24, 26, 30, 35, 39, 56, 58, 67 - ఉ.శ. |

(22) నర్కుటకము - 77, 78, 107, - పూ.శ., 41 ఉ.శ.

(23) మాలభారిణి - 84, 98, 100 పూ.శ. - 16, 88 - ఉ.శ.

(24) మందాక్రాంత - 89, 113, 127-పూ.శ. 8, 31, 45, 46-ఉ.శ.

(25) ప్రముదితవదన - 93, 97-పూ.శ.

(26) ప్రమితాక్షర - 95, 96 పూ.శ.

(27) రుచిర - 114 పూ.శ. - 98 - ఉ.శ.

(28) మత్తమయూరము - 117 పూ.శ.

(29) భుజంగప్రయాతము - 119 పూ.శ. - 9, 52, 96 - ఉ.శ.

(30) మణిగణకిరణము - 86 - పూ.శ.

(31) పృథ్వి - 126 పూ.శ. 25, 36, 57- ఉ.శ.

(32) కుసుమలతావేల్లిత - 11 - ఉ.శ.

(33) ద్రుతవిలంబితము - 32, 102 - ఉ.శ.

(34) కలహంస - 33 - ఉ.శ.

(35) ఉద్గత - 34 - ఉ.శ.

(36) మత్త - 40 - ఉ.శ.

(37) ద్రుతమధ్య - 73 - ఉ.శ.

(38) భ్రమరవిలసితము - 84 - ఉ.శ.

(39) లలిత (వియోగిని, సుందరి) - 29 - ఉ.శ.

(40) అర్ధసమవృత్తము (రుక్మవతి+ మణిగణకిరణము) - 60, 61 ఉ.శ.

(41) అనామకము (?) - 50 ఉ.శ.

శ్రీమతే రామానుజాయ నమః



శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన

# శ్రీరంగరాజస్తవము - పూర్వశతకము

## శ్రీపరాశరభట్టర్ తనియన్

శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః ।
శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మే-స్తు భూయసే ॥

**శ్రీవత్సాంకులనెడి కూరేశులకు పుత్రులు, భగ వత్కైంకర్య లక్ష్మిని కలవారు, శ్రీరంగనాథుని పురోహితులు అయిన శ్రీపరాశరభట్టర్ నాకు గొప్ప శ్రీయస్సును కల్గించాలి.**



**1.** ఆచార్య ముఖముగా భగవానుని ఆశ్రయించుట సత్సంప్రదాయము. నిరపాయమైన విధానము. ఆ పద్ధతిలో భట్టరు మొదటి అయిదు శ్లోకములలో ఆచార్యవందనమును చేయుచున్నారు. వానిలోనే కాక, ప్రబంధమునకే మొదటిది అగు ఈ శ్లోకమున కవి తనకు జన్మచే తండ్రి, విద్యచే ఆచార్యులగు శ్రీవత్సాంకమిశ్రులకు నమస్కరించుచున్నారు.

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।
యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥

కూరేశుల వచనములు వేదమను వధువుయొక్క కంఠమున మంగళ సూత్రమగు స్థితిని పొందుచున్నవి. అట్టి పూజ్యులైన శ్రీవత్సచిహ్నులకు నమస్కార వచనమును పలుకుచున్నాము.

**2.** తమకు పంచసంస్కారములను, మంత్ర రత్నమును (ద్వయ మంత్రమును) ఉపదేశించిన గోవింద భట్టర్ (ఎమ్బార్) అను ఆచార్యవర్యులను ఈ శ్లోకమున కవి స్తుతించుచున్నారు.

రామానుజపదచ్ఛాయా గోవిందాహ్వా-నపాయినీ ।
తదాయత్తస్వరూపా సా జీయాత్ మద్విశ్రమస్థలీ ॥

ఎన్నడును విడువనిది (ఎల్లప్పుడు కూడియుండునది), భగవద్రామానుజులయొక్క పాదముల నీడయై ఆ పాదములకు అధీనమైన

స్వరూపమును కల్గినది, గోవింద భట్టర్ అను పేరును కల్గినది అయిన, (దాసుడనైన) నా ఆ విశ్రాంతి స్థానము సర్వథా వర్ధిల్లునుగాక!

**3.** ఈ శ్లోకమున కవి తమకు పరమాచార్యులును, జగదాచార్యులును అగు భగవద్రామానుజులకు మంగళాశాసనమును చేయుటద్వారా ప్రణమిల్లుచున్నారు.

రామానుజమునిర్జీయాత్ యో హరేర్భక్తియంత్రతః ।
కలికోలాహలక్రీడాముథాగ్రహ మపాహరత్ ॥

శ్రీరామానుజులు విష్ణువుయొక్క భక్తి అను యంత్రము ద్వారా కలిపురుషుని కోలాహలము అనెడి మొండి పిశాచమును దూరముగా పారద్రోలిరి. అట్టి భగవద్రామా నుజమునులు చిరకాలము వర్ధిల్లుదురు గాక!

**4.** శ్రీరామానుజులకు ఆచార్యులగు మహాపూర్ణులను (పెరియనమ్బి) మనస్సున ప్రణమిల్లిన భట్టరు అనంతరము ఆ మహాపూర్ణులకు ఆచార్యులగు యామునులను ఈ శ్లోకముద్వారా స్తుతించుచున్నారు.

విధాయ వైదికం మార్గ మకౌతస్కుతకంటకమ్ ।
నేతారం భగద్భక్తేః యామునం మనవామహై ॥

వేదమునకు సంబంధించిన మార్గము (దారి) దుర్వాదములను చేయువారు అనెడి కంటకములను లేనిదిగా చేసినవారు, భగవానుడైన హరియొక్క భక్తికి నాయకులు అగు యామునాచార్యుల వారిని ధ్యానింతుము.

**5.** యామునులకు ఆచార్యులగు శ్రీరామమిశ్రులను (మణక్కాల్‌నమ్బి), వారి ఆచార్యులగు పుణ్డరీకాక్షులను (ఉయ్యక్కొణ్డార్) మనసున ప్రణమిల్లిన భట్టరు ఈ శ్లోకమున తత్త్వవిదులలో అగ్రగణ్యులు, పూర్వాచార్యులలో ప్రథములు అగు నాథమునులను స్తుతించు చున్నారు.

నౌమి నాథమునిం నామ జీమూతం భక్త్యవగ్రహే ।
వైరాగ్యభగవత్తత్త్వ జ్ఞానభక్త్యభివర్షుకమ్ ॥

భక్తి అనెడి తీర్థము (పవిత్రజలం) దుర్లభమైన వానకఱవు కాలమున లౌకిక విషయములందు ఆసక్తి లేకుండుట అనెడి వైరాగ్యము, భగవానుని స్వరూప రూపగుణ విభూతుల జ్ఞానము, భగవద్భక్తి - అను వీనిని (నీటిని) అంతటను నిరంతరము వర్షించునట్టి (పుష్కలముగా కల్గించునట్టి) నాథముని అని ప్రసిద్ధి చెందిన మేఘమును నమస్కరించుచున్నాను.

**6.** ప్రపన్నజనకూటస్థులుగా స్తుతింపబడు నమ్మాళ్వార్లను ఇందు స్తోత్రము చేయుచున్నారు. ఆళ్వార్ల అందరిలోను నమ్మాళ్వార్లు అంగి అని, మిగిలిన ఆళ్వార్లు అందరూ వారికి అంగభూతులు అని శ్రీవైష్ణవ సంప్రదాయము కావున నమ్మాళ్వార్లను స్తుతించిన మిగిలిన ఆళ్వార్ల అందరిని స్తుతించినట్లగును.

**ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్త్వ మివోదితమ్ ।**
**సహస్రశాఖాం యో-ద్రాక్షీత్ ద్రావిడీం బ్రహ్మసంహితామ్ ॥**

**నమ్మాళ్వార్లు వేయి శాఖలను కల్గిన, ద్రావిడభాషామయమైన (తిరువాయ్‌మొళి అను) ఉపనిషత్తును దర్శించిరి. అటువంటివారు, ఉదయించిన శ్రీకృష్ణుని యందుగల ప్రేమయొక్క రూపమువలె ఉన్నవారైన ఆ నమ్మాళ్వార్లు అను మహర్షిని సేవించెదము.**

**7.** నమ్మాళ్వార్లను స్తుతించిన పిదప గురుపరంపరాక్రమమును బట్టి శ్రీరామమిశ్రపుండరీకాక్ష విష్వక్సేనులను స్తుతింపవలసియున్నది. ఇచట ఆ స్తుతి లేకుండుటచే, దానిని కవి మానసికముగా నిర్వర్తించిరని చెప్పనగును. పిమ్మట కవి శరణాగతుల కందరకు పురుషకారమును చేయు సకల జగన్మాత అగు శ్రీరంగనాయకిని ఈ శ్లోకమున నమస్కరించుచున్నారు. సేనాపతి వందనము 50 వ శ్లోకమున చేయబడుచున్నది.

**నమః శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమభేదతః ।**
**ఈశేశితవ్యవైషమ్య నిమ్నోన్నత మిదం జగత్ ॥**

**ఈ ప్రపంచము శ్రీరంగనాయకియొక్క కనుబొమల విలాసములయొక్క తారతమ్యముచే (మార్పుచే) పాలించువాడు పాలింపబడవలసినవాడు - అను వ్యత్యాస ముచే పల్లముగా మిట్టగా అగుచున్నది, అట్టి శ్రీరంగనాయకికి నమస్కారము (చేయుచున్నాను).**

**8.** గురుపరంపరకు నాయకుడును, అందు చివరిగా అనుసంధింపబడు వాడును అగు శ్రియఃపతిని కవి ఈ శ్లోకమున స్తోత్రముచేయుచు ఆశ్రయించుచున్నారు.

**శ్రీస్తనాభరణం తేజః శ్రీరంగేశయ మాశ్రయే ।**
**చింతామణి మివోద్వాంత ముత్సంగే-నంతభోగినః ॥**

**శ్రీదేవిస్తనములకు అలంకారము, ఆదిశేషులయొక్క ఒడిలో వెడల గ్రక్కబడిన చింతామణివలె నున్నవాడును, శ్రీరంగమున పవళించినవాడును అగు**

**పరంజ్యోతిని శ్రీరంగనాథుని ఆశ్రయింతును.**

**9.** ఈ శ్లోకమునుండి మూడు శ్లోకములలో ద్వయమంత్రములోని పూర్వార్థములో గల శ్రీమత్ పదార్థము వివరింపబడుచున్నది. అందు మొదటగా శ్రీమత్త్వము పరత్వచిహ్నమనుట తెలుపబడుచున్నది.

**జీస్తి వస్త్విదమిత్థంత్వ ప్రసంఖ్యానపరాఙ్ముఖమ్ ।**
**శ్రీమత్యాయతనే లక్ష్మీపదలాక్షైకలక్షణమ్ ॥**

**ఇట్టి రూపమును కల్గినదని, ఇట్టి స్వభావము కల్గినదని తెలియుటకు వీలు కానిదియై, లక్ష్మీదేవియొక్క పాదములకు అలంకరింపబడిన లత్తుకయే గుర్తుగా కల్గినదై యున్న పరమాత్మ రూపమైన వస్తువు (శ్రీరంగనాథుడు), సంపదను (శోభను) నిండుగా కల్గిన శ్రీరంగాలయములో ఉన్నది.**

**10.** ఈ శ్లోకమున శ్రీరంగనాథుని తుమ్మెదగా, శ్రీదేవిని కల్పలతగా, ఆమె స్తనములను మొగ్గల గుత్తులుగా రూపించు చున్నారు.

**లక్ష్మీకల్పలతోత్తుంగ స్తనస్తబకచంచలః ।**
**శ్రీరంగరాజభృంగో మే రమతాం మానసాంబుజే ॥**

**లక్ష్మీదేవి అనెడి కల్పలతయొక్క, మిక్కిలి ఉన్నతములయిన స్తనములనెడి గుత్తులయందు మిక్కిలి చలించునట్టి రంగనాథుడు అను తుమ్మెద నా మనస్సు అనెడు పద్మమున క్రీడించుగాక!**

**11.** ద్వయమంత్రము పూర్వఖండములో మొదటి పదముగు ''శ్రీమత్'' యొక్క అర్థమును విశదీకరించు మూడుశ్లోకములలో ఇది చివరిది. ఇంతకుముందుశ్లోకములలో దివ్యదంపతులు వేరువేరుగా స్తుతింపబడిరి. ఇందు కవి ఆ ఇద్దరివలన ఆశీస్సును అభిలషించుచున్నారు.

**స్వస్తి శ్రీస్తనకస్తూరీ మకరీముద్రితోరసః ।**
**శ్రీరంగరాజాత్ శరదశ్శత మాశాస్మహే తరామ్ ॥**

**మకరి (ఆడు చేప) ఆకారమున కస్తూరితో అలదబడిన, లక్ష్మీదేవి వక్షోజముల యందు పత్రరేఖచే అంకితమైన వక్షఃస్థలమును కలవాడగు శ్రీరంగనాథునివలన మాకు నూఱేండ్లు (చిరకాలము) శుభము కలుగవలెనని మిక్కిలి ఆశింతుము.**

**12.** భగవానుని స్తుతించు శ్లోకపంచకములో ఇది చివరి శ్లోకము. ఇందు భగవానుని ప్రణత రక్షణలోని ఆదరాతిశయమును రమణీయమైన ఉత్ప్రేక్షతో భట్టరు వర్ణించుచున్నారు.

పాతు ప్రణతరక్షాయాం విలంబ మసహన్నివ ।
సదా పంచాయుధీం బిభ్రత్ స నః శ్రీరంగనాయకః ॥

తననే ప్రాప్యముగ, ప్రాపకముగ తలచి ఆశ్రయించినవారి రక్షణయందు ఆలస్యమును సహింప లేనివానివలె ఎల్లప్పుడు అయిదు విధములైన ఆయుధములను ధరించునట్టి ఆ శ్రీరంగనాథుడు మనలను రక్షించుగాక!

**13.** అనంతరము నారాయణ పదార్థమును వివరింపగోరిన భట్టరు భగవానుని స్తుతించుటలో తమ అయోగ్యతను, అశక్తిని ఈ శ్లోకమునుండి ఏడు శ్లోకములలో అనుసంధించుచున్నారు.

అమతం మతం మత మథామతం స్తుతం పరినిందితం భవతి నిందితం స్తుతమ్
ఇతి రంగరాజ ముదజూఘుషత్ త్రయీ స్తుమహే వయం కిమితి తన్న శక్నుమః

పరబ్రహ్మము ఎఱుగరానిదని తెలిసినచో అపుడు ఆ బ్రహ్మము తెలిసికొన బడినదగును; మఱియు, పరబ్రహ్మము స్తుతింప సాధ్యమైనదని తలంపబడినచో అది తెలిసికొనబడనిదే అగును; స్తుతింపబడినదయినచో అపుడా బ్రహ్మము నిందింపబడినదే అగును; ఉన్నది ఉన్నట్లు స్తుతింప సాధ్యము కానిదని చెప్పబడినచో అపుడది నిజముగా స్తుతింపబడినదగును - అని వేదము ఉద్ఘోషించెను. కావున అట్టి శ్రీరంగనాథుని మనము ఏమని స్తుతింతుము? స్తుతింపలేము.

**14.** ముందుశ్లోకమున కవి ''నేను భగవానుని స్తుతింపలేను'' అనిరి. ఆ మాటను పల్కుటకు కూడ తనకు యోగ్యత లేదని ఈ శ్లోకమున తెలుపుచున్నారు.

యది మే సహస్రవదనాదివైభవం నిజ మర్పయేత్ స కిల రంగచంద్రమాః ।
అథ శేషవత్ మమ చ తద్వదేవ వా స్తుతిశక్త్యభావవిభవే-పి భాగితా ॥

ఆ శ్రీరంగనాథుడు అను చంద్రుడు తనదైన వేయి ముఖములను కల్గియుండుట మొదలగు (మహిమను) గొప్పతనములను నాకును అనుగ్రహించినచో, అపుడు ఆదిశేషు నకువలెనో, (లేక) ఆ భగవానునకువలెనో నాకును స్తుతించుటలో శక్తి లేకుండుట అను గొప్పతనమునందును భాగస్వామ్యము ఉండును.

**15.** ముందు శ్లోకమున కవి భగవానుని గొప్పతనమును స్తుతించుట ఆ భగవానునకును సాధ్యము

కాదని పల్కెను. తాను అట్లనుటకు తగిన ప్రమాణమును ఇందు కవి ఉట్టంకించుచున్నారు.

**సో అంగ వేద యది వా న కిలేతి వేదః సంద్వేగ్ధ్యనర్ఘవిద మాత్మని రంగనాథమ్ ।**
**స్థానే తదేష ఖలు దోషమలీమసాభిః మద్వాగ్భి రైశ మతిశాయన మావృణోతి ॥**

**శ్రీరంగనాథుడును తన గొప్పతనమును తెలిసికొనెనా? లేక, తెలియడా? అని గొప్ప జ్ఞానమును కల్గిన శ్రీరంగనాథునిగూర్చి వేదము తనలో సందేహించుచున్నది. అది అట్లు సందేహించుట యుక్తమే కదా! నా మాటలతో ఇపుడు ఈశ్వర సంబంధమైన (తన సర్వేశ్వరత్వమునకు తగిన) గొప్పతనమును స్వామి మఱుగుపఱచు కొనగోరుచు నేనతనిని స్తుతింపవలెనని భావించుచున్నాడు (కాబోలు). అందువలన అతనిని నేను స్తుతింతును.**

**16.** భగవానుని స్తుతించుటకు వేదపురుషునికే సాధ్యపడనిచో ఇక మీకు ఈ స్తుతి ప్రయత్నమేల? అను ప్రశ్నకు కవి చమత్కారముగా ఈ శ్లోకమున సమాధానమిచ్చుచున్నారు.

**స్వం సంస్కృతద్రావిడవేదసూక్తైః భాంతం మదుక్తైః మలినీకరోతి ।**
**శ్రీరంగకర్మః కలభం క ఏవ స్నాత్వా-పి ధూళీరసికం నిషేద్ధా ॥**

**శ్రీరంగమునందు ఆసక్తి కల్గిన (లేదా, శ్రీరంగమందు ఆకర్షణీయుడైన) శ్రీరంగనాథుడు సంస్కృత వేదముల, ద్రావిడవేదముల సూక్తములచే ప్రకాశించునట్టి తనను ఇపుడు అల్పమైన నా మాటలచే మలిన పఱచుకొనుచున్నాడు. స్నానము చేసిన పిమ్మట కూడ బూడిదను (దుమ్మును) పూసి కొనుటలో ఆసక్తికల గున్న ఏనుగును ఎవడైనను నివారింపకలడా? (నివారింపలేడు).**

**17.** నిరంకుశ స్వతంత్రుడైన శ్రీరంగనాథుడు తమనుగైకొని ఈ స్తోత్రమును పల్కించు చున్నాడని ముందు శ్లోకమున పల్కిన భట్టరు ఈ శ్లోకమున తానట్లు స్తుతించుటకు మరి రెండు హేతువులను ఈ శ్లోకమున తెలియజేయుచున్నారు.

**కిం తు ప్రపత్తిబలతారితవిష్ణుమాయా-మద్వంశ్యరాజకులదుర్లలితం కిలైవమ్।**
**శ్రీరంగరాజ కమలాపదలాలితత్వం యద్వా-పరాధ్యతి మమ స్తుతిసాహసే-స్మిన్॥**

**కాని (అట్లయినను), ప్రపత్తి బలముచే భగవానుని మాయను దాటినవారగు నా వంశమునందలి పూర్వులయొక్క రాజకులమున జన్మించినందువలన నాకు కల్గిన గర్వము ఇట్టిది కదా! (ఇట్లు స్తుతించునట్లు నన్ను చేయుచున్నది కదా!) లేక, శ్రీరంగనాథునియొక్క, శ్రీరంగనాయకి యొక్క పాదములచే (పాదసన్నిధియందు) లాలింపబడుట(యే) నేను చేయు ఈ, స్తుతి అనెడి**

సాహసము నందు నన్ను ప్రేరేపించుచున్నది.

**18.** ముందుశ్లోకములలో భగవానుని మహిమను స్తుతించుటకు తనకు అధికారములేదనిన కవి ఇందు తనకు సాపేక్షమైన శక్తి కలదనుచున్నారు.

నాథస్య చ స్వమహిమార్ణవపారదృశ్వ - విజ్ఞానవాగ్విలసితం సహతే న వేదః । ఆపేక్షికం యది తదస్తి మమాపి తేన శ్రీరంగిణః స్తుతివిధా వహ మధ్యకార్షమ్॥

వేదముకూడ సముద్రమువలె అపారమైన భగవానుని మహిమను ఎవడైనను తెలిసికొన్నాడను మాటను సహింపదు. అనెడు సముద్రముయొక్క అంతమును చూచిన గొప్ప జ్ఞానముయొక్క మాటల విలాసమును సహించుట లేదు. లోకమున స్తుతించుట అనునది సాపేక్షమైనచో, (స్తుతించుటలో అతనికంటె ఇతడు సమర్థుడు - అను సాపేక్షత ఉన్నదనిన) నేనుకూడ లోకములో ఎవరో ఒకరి కంటే స్తుతించుటలో ఎక్కువ సామర్థ్యమును కలవాడను. ఆ కారణముచే శ్రీరంగనాథునియొక్క స్తోత్రము చేయుటలో నేను కూడా అధికారమును కల్గినవాడనైతిని.

**19.** ప్రస్తుత శ్లోకమున లోకమునందలి ఆయా జనులు తమ శక్తి కొలది భగవద్వైభవమును పొగడుట తమ పలుకులకు విలువ కల్గుట కొఱకే గాని, తాము ఆ వైభవమును పూర్ణముగా స్తుతింపకల్గుటచే కాదు; కావున వారివలెనే నేనును నా శక్తికొలది భగవానుని స్తుతించి సత్తా లాభమును పొందవచ్చును కదా ! అందుచే నేనుచేయు ఈ స్తుతి పరిహాసాస్పదము కానేరదు అని కవి పల్కుచున్నారు.

అన్యత్రాతద్గుణోక్తిర్భగవతి న తదుత్కర్షచౌర్యైః పరేషాం
స్తుత్యత్వాత్ యావదర్థా ఫణితిరపి తథా తస్య నిస్సీమకత్వాత్ ।
ఆమ్నాయానా మసీమ్నా మపి హరివిభవే వర్షబిందో రివాబ్ధౌ
సంబంధాత్ స్వాత్మలాభో న తు కబలనతః స్తోతు రేవం న కిం మే ॥

స్తుతింపదలచిన వ్యక్తి యందు లేని గుణములను ఆరోపించి చేయు స్తోత్రము అనునది సర్వేశ్వరుని విషయమునకాక వేఱొక చోట (వ్యక్తి) యందే కలదు. భగవానుని యందు లేని గుణములను ఆరోపించి స్తుతించుట అనునది అసంభావితము. ఆ భగవానునియొక్క గొప్పతనమును దొంగిలించుటద్వారా ఇతరులయొక్క స్తుతిని చేయవలసి వచ్చుటవలన ఉన్న గొప్పతనము నంతటిని

స్తుతించునట్టి మాటల పద్ధతి కూడ ఆ సర్వేశ్వరుని గొప్ప తనముయొక్క అవధిలేనితనముచే అట్టిదే (భగవానుని విషయమున అసంభావితమే). వర్షపు చినుకునకు సముద్రము నందు సంబంధమును పొందుటచే దానికి సత్త కల్గును. అట్లే, అవధి లేని వేదములు సైతము, సర్వేశ్వరుని గొప్పతనము నందు సంబంధమును పొందుటవలన (సర్వేశ్వరుని వైభవమును స్తుతించుటలో అన్వయించుట వలన) మాత్రమే తన సత్తను పొందును. కాని, భగవద్వైభవమును పూర్తిగా కబళించుట వలన (వర్ణించుటవలన) మాత్రము కాదు. కావున సర్వేశ్వరుని స్తుతించు నాకు ఇట్లు సంబంధమును కల్గియుండుట (సత్తాలాభమును పొందుట) సంభవించినది కదా?

**20.** ఈ శ్లోకమునుండి కవి అయిదు శ్లోకములలో కావేరీవర్ణనను చేయుచున్నారు. ఇందు కవి కావేరీనదిలో స్నానమాడవలెనను తన కోరికను ప్రకటించిరి.

> కావేరీ మవగాహిషీయ భగవద్భోగాంతరాయీభవత్ -
> కర్మక్లేశఫలాశయ ప్రశమనోద్వేలామలస్రోతసమ్ ।
> జంతోః సంసరతో-ర్చిరాదిసరణివ్యాసంగభంగాయ యా
> లోకే-స్మిన్ విరజేవ వేల్లితజలా శ్రీరంగ మాలింగతి ॥

కావేరీనది, సంసారి అయిన ప్రాణికి అర్చిరాది మార్గమున కల్గు అలసటను (ఆటంకములను) పోగొట్టుటకై ఈ లోకమున (మిక్కిలి వేగముగా సుడులు తిరుగుచూ ప్రవహించు) గొప్ప నీటిని కల్గిన విరజానది వలె శ్రీరంగక్షేత్రమును చుట్టుకొని యున్నది. (అట్టి) భగవానుని అనుభవమునకు ఆటంకములైయున్న పుణ్యాపాప రూపకర్మలు, అవిద్య మొదలగు కష్టములు, కర్మఫలములు, వాసన - అను వీనిని పోగొట్టునది, గట్టును తాకుచు ప్రవహించు (అధికమైన) నిర్మలమైన ప్రవాహమును కల్గినదగు కావేరీనదిని ప్రవేశింతును (స్నానమాడెదను).

21. ''తేటపడని కలగిన నీటితో చుట్టబడిన శ్రీరంగము'' అని తొణ్డరడిప్పొడియాళ్వార్లు (విప్రనారాయణులు) తిరుమాలై దివ్యప్రబంధమున కావేరిని కీర్తించిరి. కావేరీనదిలో నీరు అట్లు కలగియుండుటకు ఈ శ్లోకమున ఒక హేతువును భట్టరు చమత్కారపూర్వకముగా ఉత్ప్రేక్షించుచున్నారు.

> దుగ్ధాబ్ధి ర్జనకో జనన్యహ మియం శ్రీ రేవ పుత్రీ వరః
> శ్రీరంగేశ్వర ఏతదర్హ మిహ కిం కుర్యా మితీవాకులా ।

చంచచ్చామరచంద్రచందనమహామాణిక్యముక్తోత్కరాన్
కావేరీ లహరీకరై ర్విదధతీ పర్యేతి సా సేవ్యతామ్ ॥

పాలసముద్రము తండ్రి; నేను తల్లి; ఈ లక్ష్మీదేవియే (శ్రీరంగనాయకియే), (వధువు) కుమార్తె; శ్రీరంగనాథుడు వరుడు; (ఇట్లుండగా) ఈ కుమార్తెకు, వరునకు తగినట్లు ఏమి కానుకలను ఇచ్చెదను? అని కావేరీనది కలతచెందినది వలె ప్రకాశించు చామరముల, పచ్చకర్పూరముల, చందనఖండముల, గొప్ప గొప్ప రత్నముల, ముత్యముల సమూహములను కెఱటములనెడి చేతులతో సమర్పించుచున్నదై, శ్రీరంగము చుట్టును ప్రవహించుచున్నది (ప్రదక్షణము చేయుచున్నది). అట్టి కావేరి (జనులచే) సేవింప బడుగాక!

**22.** తొండరడిప్పొడియాళ్వార్లు తిరుమాలై దివ్యప్రబంధమున కావేరీనదిని ''గంగకన్న పూతమగు కావేరీ'' అనుచు ప్రస్తుతించిరి. అట్లు పల్కుటకు భట్టరు ఒక చక్కని హేతువును ఈ శ్లోకమున ఉత్ప్రేక్షించుచున్నారు.

తీర్థం శుంధతి పాతి నందనతరూన్ రథ్యాంగణాన్యుక్షతి
స్నానీయార్హణపానవారి వహతి స్నాతః పునీతే జనాన్ ।
శ్యామం వేదరహో వ్యనక్తి పులినే ఫేనై ర్హసంతీవ తత్
గంగాం విష్ణుపదీత్వమాత్రముఖరాం హేమాపగా హంత్యఘమ్ ॥

''పొన్ని'' అను పేరును కల్గిన కావేరీనది తీర్థమని పేరు పడిన పుణ్యజలములను పరిశుద్ధము చేయుచున్నది. ఉద్యానవనమునందలి వృక్షములను రక్షించుచున్నది. వీథులను, నాల్గు వీథుల కూడలులను (ముంగిళ్లను) తడపుచున్నది. స్నానమునకు తగిన దేవతారాధనకు తగిన త్రాగుటకు తగిన నీటిని కల్గియున్నది. తనలో స్నానము చేయు జనులను పావనము చేయుచున్నది. నల్లని వర్ణము కల్గిన వేదరహస్యమును (శ్రీరంగ నాథుని) తీరప్రాంతమున ఇసుకతిన్నెయందుగల శ్రీరంగ క్షేత్రములో అందఱకు కనబడునట్లు వ్యక్తము చేయుచున్నది. ఇట్టి వైభవమును కలిగియుండుటచే కావేరి నది, విష్ణువు పాదమునుండి పుట్టుట అను ఒక్క కారణము చేతనే మిక్కిలి ఘోషపెట్టు (గర్వించు) గంగానదిని తన నుఱుగుతో పరిహాసము చేయుచున్నట్లున్నది. ఆ నది మన పాపమును పోగొట్టునుగాక!

**23.** శ్రీరంగనాథుని కరుణయే కావేరీనదిగా రూపొందినదనుచు కవి ఈ శ్లోకమున తన కవితాచాతుర్యమును ప్రకటించుచున్నారు.

అగణితగుణావద్యం సర్వం స్థిరత్రసమప్రతి -
క్రియమపి పయఃపూరై రాప్యాయయంత్యనుజాగ్రతీ ।
ప్రవహతి జగద్ధాత్రీ భూత్వేవ రంగపతే ర్దయా
శిశిరమధురా- గాధా సా నః పునాతు మరుద్వృథా ॥

కావేరీనది, ప్రాయశ్చిత్తముకూడ లేని స్థావరజంగమములను అన్నిటిని వారి గుణ దోషములను పరామర్శించి చూడకుండ, తన జలప్రవాహములతో తృప్తి పఱచుచున్నదై, తోడుగా మేల్కొని యున్నందున శ్రీరంగనాథుని దయవలె ఉన్నది. లోకమున కంతటికి పెంపుడు తల్లియై ప్రవహించుచున్నది. చల్లనిది, తీయనిది, లోతైనది అగు ఆ కావేరీనది మనలను పవిత్రము చేయుగాక!

**24.** ముందుశ్లోకమున కవి కావేరీనదిని స్తుతించిరి కదా! కావేరీనదీజలములు సహజముగా అత్యంతమధురములు. దానితో పాటు ఆ జలములు మాధుర్యము ద్విగుణీకృతమగుటకు కవి ఇందు ఒక హేతువును ఉత్ప్రేక్షించుచున్నారు.

తరళతనుతరంగైః మంద మాందోళ్యమాన-
స్వతటవిటపిరాజీ మంజరీసుప్తభృంగా ।
క్షిపతు కనకనామ్నీ నిమ్నగా నాళికేర -
క్రముకజమకరందైః మాంసలాపా మదంహః ॥

మిక్కిలి చలించునవి, చిన్నవి అగు కెరటములచే కావేరీ నది తీరములో వృక్షసమూహములలోని పూలగుత్తులు మెల్లగా ఊగుచున్నవి. ఆ పూలగుత్తులలో తుమ్మెదలు హాయిగా నిద్రించుచున్నవి. కొబ్బరి చెట్లనుండి, పోకచెట్లనుండి పుట్టిన తేనెలతో అభివృద్ధి చెందిన నీటిని కల్గిన, "పొన్ని" అను పేరును కల్గిన ఈ కావేరీ నది నా పాపమును పోగొట్టు గాక!

**25.** భట్టరు ఈ శ్లోకమున, తరువాతి శ్లోకమున ఆరామపరివేష్ఠితమైన శ్రీరంగక్షేత్ర ద్వీపముయొక్క భోగ్యతను కీర్తించుచున్నారు.

కదళవకుళజంబూ పూగమాకందకంఠ-
ద్వయసరసనీరా మంతరా సహ్యకన్యామ్ ।
ప్రబలజలపిపాసా లంబమానాంబుదౌఘ-
భ్రమకరతరుబృందం వంద్యతా మంతరీపమ్ ॥

అరటిచెట్లయొక్క, పోగడచెట్లయొక్క, నేరేడు చెట్లయొక్క, పోకచెట్లయొక్క, తీయమామిడిచెట్లయొక్క కంఠమువరకు గల మధురమైన నీటిని కల్గినదగు కావేరీనది మధ్యలో శ్రీరంగద్వీపమున్నది. గొప్పదైన నీటిని త్రాగవలెనను కోరికచే క్రిందకు వ్రేలాడు మేఘముల (యొక్క) సమూహమా? అను భ్రమను కల్గించు వృక్ష సమూహమును ఆ దీవి కల్గియున్నవి. అట్టి దీవి మనచే నమస్కరింప బడుగాక!

**26.** విరజానదీతీరమునగల పరమపదమును ముక్తులకు మాత్రమే దర్శింప సాధ్యమగును. ఈ శ్రీరంగద్వీపము సంసారులకు సైతము అందుబాటులో ఉన్నది అనుచు కవి ఈ శ్లోకమున శ్రీరంగక్షేత్రద్వీపముయొక్క సౌలభ్యము కీర్తించుచున్నారు.

యద్విష్ణోః పద మపరం పరో రజో-గ్ర్యం
ముక్తానా మనువిరజం విదీప్ర మాహుః ।
తత్పుణ్యం పులిన మిదంతయా-ద్య మధ్యే-
కావేరి స్ఫురతి తదీక్షిషీయ నిత్యమ్ ॥

విరజానదీసమీపమున నున్నది, తమోగుణము లేనిది, రజోగుణమునకు దూరమైనది, గొప్పది అగు పరమపదమును ముక్తులకు (మాత్రమే) మిక్కిలి ప్రకాశించునది అని పల్కుదురు. ఇపుడు ఆ పరమపదము, పవిత్రమైన విరజానదీ సైకతములో ఈ సంసారదశలో కూడ అందరిచే స్పష్టముగా తమ కన్నులతో దర్శింప సాధ్యమగునట్లు కావేరీ నది మధ్యలో శ్రీరంగ నగర రూపమున ప్రకాశించుచున్నది. ఆ సైకతమును (శ్రీరంగ నగరమును) ఎల్లప్పుడును దర్శింతును.

**27.** శ్రీరంగక్షేత్రము చుట్టును విస్తరించిన ఆరామముల నిత్యప్రాప్యత్వమును కవి ఇందు ప్రస్తుతించుచున్నారు.

త్రయ్యంతప్రహతిమతీషు వైష్ణవానాం ప్రాప్యాసు ప్రచురభవశ్రమాపహాసు
కావేరీపరిచరితాసు పావనీషు శ్రీరంగోపవనతటీషు వర్తిషీయ ॥

ఉభయవేదాంతముల నిరంతరాభ్యాస ఘోషను కల్గినవియు, ప్రబలమైన సంసారమునందలి తాపమును పోగొట్టునవియు, పవిత్రములైనవియును శ్రీవైష్ణవులకు పొందదగినవియును, కావేరీ నదిచే చల్లని గాలులతో సేవింపబడినవియును అగు శ్రీరంగక్షేత్రమునందలి ఆరామస్థలములయందు నివసింతును.

**28.** శ్రీరంగక్షేత్రము చుట్టును గల దివ్యారామముల భోగ్యత్వము వాని ప్రాప్యతకు తగినదను

విశేషమును కవి ఇందు వర్ణించుచున్నారు.

స్ఫురితశఫరదీర్య న్నాలికేరీగుళుచ్ఛ ప్రసృమరమధుకుల్యా వర్ధితానోకహాని
రతి మవిరతి రంగారామరమ్యస్థలాని క్రముకపనసమోచా మేచకాని క్రియాసుః ॥

ఎగసి త్రుళ్లిపడు చేపలచే పగులగొట్టబడుచున్న నారికేళముల గుత్తులనుండి మిక్కిలిగా స్రవించు తేనె కాలువలచే (ప్రవాహములచే) పెంపొందింపబడిన వృక్షములను కల్గినవి, పోకచెట్లు, పనసచెట్లు, అరటిచెట్లు - అను వీనితో దట్టమైన శ్యామల వర్ణమును కల్గినవి అగు శ్రీరంగక్షేత్రములోని తోటలలోని మనోహరములైన ప్రదేశములు మనకు ఆనందమును ఎడతెగక కలుగజేయునుగాక!

**29.** ఈ శ్లోకమునుండి మూడు శ్లోకములలో భట్టరు శ్రీరంగనగరమును స్తుతించుచున్నారు.

అధిపరమపదం పురీ మయోధ్యా మమృతవృతా మపరాజితా ముశంతి ।
పుళిన ముపరి రంగరాజధానీ పిశితదృశా మపి సా పుర శ్చకాస్తి ॥

పరమపదమునందు అమృతమయములైన జలములను కల్గిన విరజానదిచే చుట్టబడినది, (లేదా, నిత్యులచే, ముక్తులచే నిండినది), అయోధ్య అను పేరు కల్గినది, అపరాజిత అను పేరును కల్గినది అగు వైకుంఠనగరమును ఉన్నదని వైదికులు పేర్కొనుచున్నారు. ఆ దివ్యనగరము ఇపుడు శ్రీరంగనాథుని రాజధానిగా (కావేరీ నదీ) సైకతముపై మాంసచక్షువులను కల్గినవారికికూడ కట్టెదుట ప్రకాశించుచున్నది.

**30.** ఇందు శ్రీరంగనగరములోని దివ్య భవనములను కవి వర్ణించుచున్నారు. శ్రీరంగక్షేత్రమునకు పరమపదత్వమును, అంతకంటె విశేషమును ఉపపాదించుట ఈ శ్లోకములోని విశేషము.

భవపద మపి దివ్యధామ కర్తుం తదుభయతంత్రితహర్మ్యమాలికేవ ।
భవనమణితలైః విజృంభమాణా జయతి తరా మిహ రంగరాజధానీ ॥

సంసారమునుకూడ నిత్యవిభూతిగా చేయుటకువలె, ఆ నిత్యవిభూతి, లీలా విభూతుల మధ్య, సంఘటితమైన మేడల, మిద్దెల వరుసలను కల్గినదై, గృహముల యందు మణులు పొదగబడిన వేదికలచే (ఉపరిభాగములచే) వృద్ధి చెందుచున్నదగు శ్రీరంగనాథుని రాజధాని (శ్రీరంగము) ఈ లోకమున మిక్కిలి ఉత్కర్షతో ప్రకాశించు చున్నది.

**31.** శ్రీరంగనగరము శ్రీరంగనాథుని రాజధాని అనుటకు తగినట్లు మకరాలంకృతమైన

ధ్వజస్థంభములను కవి ఇందు వర్ణించుచున్నారు.

మణిమకరరుచీః వితత్య పాశాన్ విసృమరకేతుకరై ర్మృగం హిమాంశోః ।
శ్రియ ఇవ నవకేళయే జిఘృక్షుః సుఖయతి రంగపురీ చకాసతీ నః ॥

రత్నములచే చేయబడిన తోరణముల కాంతులే పాశములుగా (త్రాళ్లుగా, వలలుగా) విస్తరించగా, పైపైకి ప్రసరించు ధ్వజములనెడి చేతులతో చంద్రుని లోగల జింకను, లక్ష్మీదేవియొక్క అపూర్వమైన లీలకొఱకు పట్టుకొన గోరుచున్నట్లు శ్రీరంగ నగరము తోచుచున్నది. అట్టి నగరము మనలను సంతోషింప జేయుచున్నది.

**32.** శ్రీరంగనగరము వైకుంఠపురికి ప్రతిరూపము. కావున, శ్రీరంగములోగల నగర పరిపాలకులకును అవియే పేర్లు. భట్టరు ఈ శ్లోకమున ఈ ఎనిమిదిమంది నగరరక్షకులను నమస్కరించుట ద్వారా వారి అనుజ్ఞను ప్రార్థించి, పొందుగున్నారు.

జనపదసరిదంతరీప పుష్యత్ పురపరిపాలన నిత్యజాగరూకాన్ ।
ప్రహరణపరివార వాహనాఢ్యాన్ కుముదముఖాన్ గణనాయకాన్ నమామి ॥

జనులకు నివాసస్థానమై, కావేరీనదిమధ్య గల ద్వీపమున వర్ధిల్లుచున్న శ్రీరంగ నగరమును రక్షించుటలో ఎల్లప్పుడు మెలకువగా నుండువారు, ఆయుధములతో, పరిజనములతో, వాహనములతో కూడినవారును అగు కుముదుడు మొదలగు గణనాథు లను నమస్కరించెను.

**33.** శ్రీరంగమున మానవులుగా, తిర్యక్కులుగా, స్థావరములుగా నైన కావలయునని నిత్యసూరులు, ముక్తులు, ముముక్షువులు అభిలషించి ఆ రూపములను పొందుదురు. కావున అచటి వారిని సామాన్యులని తలపక, వారికి భక్తితో నమస్కరింపతగునను విశేషమును కవి ఈ శ్లోకమున తెలియజేయుచున్నారు.

అహృతసహజదాస్యాః సూరయః ప్రస్తబంధాః
విమలచరమదేహా ఇత్యమీ రంగధామ ।
మహితమనుజతిర్యక్స్థావరత్వాః శ్రయంతే
సునియతమితి హ(యే)స్మ ప్రాహు రేభ్యో నమః స్తాత్ ॥

ఏనాడు హరింపబడని (అప్రతిహతమైన) సహజమైన దాస్యమును (శేషవృత్తిని) కలవారగు నిత్యసూరులు, సంసారబంధమును వీడిన ముక్తులు, (సమస్త పాపములు తీరుటచే) పవిత్రమైన చివరిదైన దేహమును కల్గినవారగు ముముక్షువులును- అను

వీరు, గొప్పవైన, మానవులయొక్క పక్షులయొక్క, స్థావరములయొక్క స్థితిని కోరువారై, శ్రీరంగమును ఎల్లప్పుడును ఆశ్రయించుచున్నారు - అని కదా పౌరాణికులు పల్కుదురు. వీరికి (ఇట్లు మానవ-తిర్యక్-స్థావర జన్మలను పొందిన నిత్య-ముక్త- ముముక్షువులకు) నమస్కారము అగుగాక!

**34.** ఉన్నతములైన గోపురములతో విరాజిల్లు శ్రీరంగమందిరమును ఈ శ్లోకమున భట్టరు అద్భుతమైన ఉత్ప్రేక్షతో స్తుతించుచున్నారు.

శ్రీరంగదివ్యభవనం భువి గోపురాణాం ప్రాకారితేన నికరేణ గరుత్మతేవ ।
పార్శ్వప్రసారితపతత్రపుటేన భక్త్యా నానాతనూభి రుపగూఢ ముపఘ్నయామః ॥

రెండు వైపుల ప్రాకారములను కల్గిన గోపురముల సమూహముచే శ్రీరంగ మందిరము చుట్టబడియుండుటను చూడగా, రెండు ప్రక్కల విస్తరింపబడిన, పుటాకార ములోనున్న రెక్కలను కల్గిన గరుత్మంతునిచే భక్తితో భూలోకమున బహువిధములైన రూపములతో కప్పి కాపాడబడుచున్నట్లున్నది. అట్టి శ్రీరంగదివ్యమందిరమును ఆశ్రయముగా పొందెదము.

**35.** ముందుశ్లోకమున వర్ణించిన విషయమునే కవి మరల వేరొక దృష్టాంతముతో ఇందు వర్ణించుచున్నారు. శ్రీరంగమందిరము మూర్తీభవించిన భూదేవి వలె ఉన్నదనుట ఈ శ్లోకములోని సారాంశము.

ప్రాకారమధ్యాజిరమండపోక్త్యా సద్వీపరత్నాకరరత్నశైలా ।
సర్వంసహా రంగవిమానసేవాం ప్రాప్తేవ తన్మందిర మావిరస్తి ॥

ప్రాకారములు, ఆ ప్రాకారముల మధ్యగల ముంగిళ్లు, మండపములు - అను వీనితో శ్రీరంగమందిరము, సప్తద్వీపములతో, సప్తసముద్రములతో, మేరుపర్వతముతో కూడిన భూదేవి శ్రీరంగవిమానసేవను పొందినదివలె ఉన్నది. ఆ శ్రీరంగమందిరము మన కట్టెదుట సాక్షాత్కరించుచున్నది.

**36.** ఆళ్వార్ల అవతారప్రయోజనములు అనేకములు. వానిలో ముఖ్యమైన ప్రయోజనము అవైదికులను వైదికులుగా మార్చుట. ఆ మార్పు చేతనములలోనే కాక అచేతనములలో సైతము సంభవించెనని భట్టరు ఈ శ్లోకమున తెలియజేయుచున్నారు.

జితబాహ్యజినాదిమణిప్రతిమా అపి వైదికయన్నివ రంగపురే ।
మణిమండప వప్రగణాన్ విధధే పరకాలకవిః ప్రణమేమహి తాన్ ॥

తిరుమజ్జైయాళ్వార్లు, వేదబాహ్యులైన జినులు మొదలగువారిని జయించుట కాక, వారి రత్నప్రతిమలను కూడ వైదికముగా చేయువారువలె (వానిని ఉపయోగ పఱచి) శ్రీరంగమున మణులతో కూడిన మండపముల, ప్రాకారముల సమూహము లను నిర్మించిరి. ఆ మణిమండపములను, ప్రాకారములను నమస్కరింతుము కదా.

**37.** భగవదాలయమునకు పూర్వద్వారమున చండ - ప్రచండులు, దక్షిణమున భద్ర - సుభద్రులు, పశ్చిమమున జయ - విజయులు, ఉత్తరమున ధాత - విధాతలు రక్షణభారమును నిర్వహింతురు. కవి వారిని ఈ శ్లోకమున ప్రణమిల్లుచున్నారు.

**స్మేరాననాక్షికమలైః నమతః పునానాన్ దంష్ట్రాగదాభ్రుకుటిభిః ద్విషతో ధునానాన్।**
**చండప్రచండముఖతః ప్రణమామి రంగద్వారావలీషు చతసృష్వధికారభాజః ॥**

**తమ వికసించిన ముఖములు, కన్నులు అనెడి కమలములతో (కమలములవంటి ముఖములతో, కన్నులతో) నమస్కరించువారిని పవిత్రులుగా చేయువారు, కోఱలతో, గదలతో, కనుబొమల కుటిలగతులతో (కదలికలతో) శత్రువులను (భగవద్భాగవత విరోధులను) భయపెట్టువారును, నాలుగు ద్వారములవరుసయందు రక్షణాధికారమును కల్గినవారును అగు చండుడు, ప్రచండుడు మొదలగు శ్రీరంగనగర ద్వారపాలకులను నమస్కరింతును.**

**38.** తూర్పుద్వారముద్వారా శ్రీరంగమందిరమును ప్రవేశించిన భట్టరు మొదటగా వేయికాళ్లమండపమును ఈ శ్లోకమున కీర్తించుచున్నారు.

**సర్వాత్మసాధారణనాథగోష్ఠీ పూరే-పి దుష్పూరమహావకాశమ్ ।**
**ఆస్థాన మానందమయం సహస్రస్థూణాదినామ్నా తమవాప్నవాని ॥**

**ఆత్మలన్నిటికి సమానుడైన ప్రభువగు శ్రీరంగనాథుని భక్తుల గోష్ఠి, ప్రవాహముగా వచ్చినను నిండించుటకు సాధ్యము కాని గొప్ప ప్రదేశమును కల్గినది, 'సహస్రస్థూణా' అను పదమును మొదట కల్గిన ఉపనిషత్ వాక్యముచే నిర్దేశింపబడినది, ఆనందమే మూర్తీభవించినట్లున్నది అగు ఆ వేయికాళ్ళమండపమును సేవింతును (పొందెదను).**

**39.** ఈశ్లోకమున, తదుపరిశ్లోకమున కవి చంద్రపుష్కరిణిని స్తుతించుచున్నారు. ఈ పుష్కరిణి శ్రీరంగాలయమున ఉత్తరదిక్కున కలదు.

**విహరతి హరౌ లక్ష్మ్యా లీలాతపత్రపరిష్క్రియా -**

వినిమయవిధౌ సూనాసూనిక్రియాసఫలోత్పలామ్ ।
అథ మునిమనఃపద్మేష్వబ్జా సహాయవిహారజ -
శ్రమహరతటీం యామ స్తా మైందవీ మరవిందినీమ్ ॥

శ్రీరంగనాథుడు శ్రీరంగనాయకితో పాటు విహారమును చేయునపుడు, వారి క్రీడలలో గొడుగులుగా అగుటచే, కర్ణభూషణము మొదలగు అలంకారములుగా అగుటచే, వారు ఒకరికొకరు మాలికలను మార్చుకొనుటకు తగినట్లు ఉపయోగపడుటచే, వారు పుష్పయుద్ధమును చేయుటకు సాధనములుగా అగుటచే జన్మసాఫల్యమును పొందిన పద్మములను కల్గినది, మఱియు, మహర్షులయొక్క హృదయ పుండరీకములలో సలక్ష్మీకుడైన భగవానునకు విహరించుటవలన కల్గిన అలసటను తీర్చు చల్లని తీరమును కల్గినది అగు ఆ ప్రసిద్ధమైన చంద్రపుష్కరిణిని పొందెము (చేరెదము).

**40.** ముందు శ్లోకమున చంద్రపుష్కరిణిని సమీపింతుము అని పల్కిన కవి ఇందు తాము ఆ పుష్కరిణిలో స్నానమొనర్చి, పాపములను పోగొట్టుకొందునను విషయమును తెలుపుచున్నారు.

తాపత్రయీ మైందవపుష్కరిణ్యాం నిమజ్య నిర్వాపయితా-స్మి యస్యాః ।
అభ్యాసతో-పా మఘుమర్షణీనాం చంద్రః సుధాదీధితితా మవాప ॥

పాపమును పోగొట్టు చంద్రపుష్కరిణిలోని నీటిలో మాటి మాటికి స్నానము చేయుటచే చంద్రుడు అమృతకిరణములను కల్గినవాడయ్యెను. అట్టి చంద్రపుష్కరిణిలో స్నానమొనర్చి, మూడు విధములైన తాపములను పోగొట్టుకొనువాడనై ఉన్నాను.

**41.** చంద్రపుష్కరిణికి తూర్పుదిశలో ప్రతిష్ఠింపబడిన పదిమంది ఆళ్వార్లను కవి ఈ శ్లోకమున స్తుతించుచు, వారి అనుగ్రహమును ప్రార్థించుచున్నారు.

పూర్వేణ తాం తద్వదుదారనిమ్న ప్రసన్నశీతాశయమగ్ననాథాః ।
పరాంకుశాద్యాః ప్రథమే పుమాంసో నిషేదివాంసో దశ మాం దయేరన్ ॥

ఆ చంద్రపుష్కరిణికి తూర్పున ప్రతిమల రూపమున అధివసించియున్నవారు, ఆ పుష్కరిణివలెనే గొప్పదైన, గంభీరమైన, స్వచ్ఛమైన (తేటగానున్న), చల్లనైన తమ హృదయమునందు (తీర్థము నందు) మునిగిన (స్థిరముగా నిలచిన) భగవానుని కల్గినవారగు నమ్మాళ్వార్లు మొదలగు పదిమంది ఆళ్వార్లు నన్ను దయజూపుదురు గాక!

**42.** ఈ శ్లోకమునుండి నాలుగు శ్లోకములలో శ్రీరంగవిమానమును, కవి స్తుతించుచున్నారు. భగవద్రామానుజులు నిత్య గ్రంథమున పీఠార్చనను గూర్చి తెలుపుచు ''ఓం ఆధారశక్త్యై నమః, ఓం ప్రకృత్యై నమః'' అని ప్రారంభించి రచించిన క్రమమును అనుసరించి ప్రస్తుతశ్లోకము రచింపబడినది.

**ఆధారశక్తి ముపరి ప్రకృతిం పరేణ తాం కూర్మమత్ర ఫణినం పృథివీం ఫణాసు ।**
**పృథ్వ్యాం పయోధి మధితన్నళినం విధాయ శ్రీరంగధామ సునివిష్ట మభిష్టవాని ॥**

**ఆధారశక్తికి పైన (భగవచ్ఛక్తికి పైన) ఆదికూర్మమును, ఆ కూర్మముపై ఆదిశేషుని, ఆదిశేషుని పడగలపై భూమిని, భూమిపై సముద్రమును, ఆ సముద్రముపై అష్టదళపద్మమును నిలిపి, దానిపై సుప్రతిష్ఠితముగానుండు శ్రీరంగవిమానమును స్తుతింపగోరెదను.**

**43.** పరమపదములోని 'అపరాజిత' అను పరబ్రహ్మస్థానమే భూలోకమున శ్రీరంగ విమానముగా అవతరించినదని కవి ఈ శ్లోకమున తెలుపుచున్నారు.

**పరేణ నాకం పురి హేమమయ్యాం యో బ్రహ్మకోశో-స్త్యపరాజితాఖ్యః ।**
**శ్రీరంగనామ్నా తమపౌరుషేయం విమానరాజం భువి భావయాని ॥**

**స్వర్గలోకమునకు పైనగల (ప్రకృతిమండలమునకు ఆవల గల) హిరణ్మయమైన, వైకుంఠ నగరమున అపరాజిత అను పేరును కల్గిన పరబ్రహ్మస్థానము కలదు. మానవులచే నిర్మింపబడనిది (పురుషప్రయత్నమునకు గోచరము కానిది) అగు ఆ గొప్ప విమానమును, భూలోకమున శ్రీరంగవిమానమను పేరుతో అవతరించినదిగా భావింతును.**

**44.** ముందుశ్లోకమున 'అపరాజిత' అనబడు బ్రహ్మనివాసస్థానమే శ్రీరంగవిమానముగా అవతరించెనని పల్కిన కవి ఇందు ఆ విమానముయొక్క ఆశ్రయణీయతను, తరువాతి శ్లోకమున భోగ్యతను స్తుతించుచున్నారు.

**అనాద్యామ్నాతత్వాత్ పురుషరచనాదోషరహితం**
**జనే తాంస్తాన్ కామాన్ విదధపి సాయుజ్యహృదయమ్ ।**
**అసందేహాధ్యాసం భగవదుపలంభస్థల మమీ**
**ప్రతీమః శ్రీరంగం శ్రుతిశతసమానర్ధి శరణమ్ ॥**

**అనాదిగా (స్వయంవ్యక్తముగా) వ్యవహరింపబడుటచే మానవులు చేయు**

నిర్మాణములో సంభవించు దోషములు లేనిది, జనమునకు ఆయా (వారు వారు కోరిన) కోరికలను (పురుషార్థములను) ఇచ్చునది, అయినను మోక్షము నిచ్చుట యందే (అభిప్రాయమును) ఆశయమును కల్గినది, సందేహము, విపర్యయము - అను దోషములను లేనిది, భగవానుడు ప్రకాశించు చోటు (కావుననే) అనేక వేదములతో సమానమైన అతిశయ మును కల్గినది అగు శ్రీరంగవిమానమును మేము శరణముగా విశ్వసింతుము.

**45.** శ్రీరంగవిమానము తెల్లగాయుండియుండవలెనుకదా! కాని, అది నల్లని వర్ణములో కన్పడుచున్నదే ? అనినచో, అందులకు కవి సమాధానమును తెలుపుచున్నారు.

> అపి ఫణిపతిభావాత్ శుభ్ర మంతశ్శయాళోః
> మరకతసుకుమారైః రంగభర్తు ర్మయూఖైః ।
> సకలజలధిపానశ్యామ జీమూతజైత్రం
> పులకయతి విమానం పావనం లోచనే నః ॥

శ్రీరంగవిమానము ఆదిశేషుని రూపమగుటచే తెల్లనిదైనను, తన లోపల పరుండి యున్న శ్రీరంగనాథుని, మరకతమణియొక్క నల్లని కాంతులవలె, అందమైన కాంతులచే కూడినదై, సమస్తమైన సముద్రమును త్రాగుటచే నల్లనిదైన మేఘమును కూడా జయించునట్లున్నది. (మేఘము కంటే నల్లగా ఉన్నది) అట్టి పవిత్రమైన శ్రీరంగ విమానము మనయొక్క రెండు కన్నులకు గగుర్పాటును (ఆనందము) పొందించు చున్నది.

**46.** శ్రీరంగవిమానమునకు ఉత్తరభాగమునగల గోపురశిఖరముపై విరాజిల్లు నృసింహమూర్తిని రెండు శ్లోకములలో భట్టరు స్తుతించుచున్నారు.

> వ్యాపి రూపమపి గోష్పదయిత్వా భక్తవత్సలతయోజ్ఝితవేలమ్ ।
> తద్విషంతపనృకేసరిరూపం గోపురోపరి విజృంభిత మీడే ॥

అంతట వ్యాపించియుండు (గొప్పదైన) తన రూపమును కూడ (ఆవుపాదమంత చిన్నదిగా) సంకోచింపజేసికొని, గోపురముపై ప్రకాశించునది, భక్తుడైన ప్రహ్లాదునిపై గల ప్రేమచే అవధిని దాటి అవతరించినది, (విలక్షణమైన) భాగవతశత్రువగు హిరణ్యకశిపునకు తాపమును కలుగజేయునది అగు ఆ నరసింహరూపమును స్తుతింతును.

**47.** మిగిలిన భగవన్మూర్తులవలె భూమిపై అధివసింపక, ఎల్లప్పుడును ఉన్నతమైన స్థలములలో నివసించు నృసింహమూర్తిని దర్శించినపుడు కల్గిన భావమును కవి ఇందు అందమైన ఉత్ప్రేక్షతో వ్యక్తము చేయుచున్నారు.

**అహ మల మవలంబ స్సీదతా మిత్యజస్రం నివసదుపరిభాగే గోపురం రంగధామ్నః**

**।**

**క్వచన నృపరిపాటీవాసితం క్వాపి సింహ-క్రమసురభిత మేకం జ్యోతి రగ్రే చకాస్తి**

**॥**

**"ఈ సంసారమున బాధపడువారికి నేను తగిన ఆధారమును (చేతి కఱ్ఱను)" అని తెలుపునట్లు శ్రీరంగమందిరముయొక్క గోపురమునకు పైభాగమున ఎల్లప్పుడు నివసించునట్టిది, (కంఠమున క్రింద ఉండు) ఒక భాగమున మానవశరీరక్రమముతో సువాసితమైనది మఱియు, వేఱొకభాగమున (శిరస్సులో) సింహముయొక్క శరీరక్రమముతో పరిమిళితమైనదగు అద్వితీయమైన జ్యోతిస్సు (నృసింహరూపములో) కట్టెదుట ప్రకాశించు చున్నది.**

**48.** ఈ శ్లోకమున ప్రస్తుతింపబడు గురుపరంపర భట్టరుకాలము నాటికి శ్రీరంగ దేవాలయమున ప్రతిష్ఠింపబడలేదు. కాని, శ్రీరామానుజులు నిత్యగ్రంథమున పీఠార్చనావిధానము పిదప గురుపరంపరాసమారాధనమును తెలుపుటనుబట్టి, ఆ క్రమములోనే భట్టరు ఈ శ్లోకమున గురుపరంపరావందనమును చేయుచున్నారు అని చెప్పనగును.

**సంశోధ్య పావనమనోహరదృష్టిపాతైః**
**దేవాయ మామపి నివేదయతాం గురూణామ్ ।**
**సవ్యోత్తరే భగవతో-స్య కటాక్షవీక్షా -**
**పంక్తిం ప్రపద్య పరితః పరితో భవేయమ్ ॥**

**అపవిత్రుడనైన నన్ను కూడ పవిత్రములైన అందమైన కటాక్షములతో పరిశుద్ధుని చేసి భగవానునకు సమర్పించువారు, ఈ భగవానునకు (శ్రీరంగనాథునకు) ఎడమవైపు ఉత్తర దిక్కున (వేంచేసియున్న) వారైన ఆచార్యుల కంటిచూపుల వరుసను శరణముగా చేసికొని, (ఆ ఆచార్యులకు) మాటి మాటికి ప్రదక్షిణము చేయుదును.**

**49.** చంద్రపుష్కరిణీ తీరమునగల పొన్నచెట్టును భట్టరు ఈ శ్లోకమున స్తుతించు చున్నారు.

**శ్రీరంగరాజకర నమ్రితశాఖికాభ్యో లక్ష్మ్యా స్వహస్తకలిత శ్రవణావతంసమ్**

**।**

పున్నాగతల్లజ మజస్రసహస్రగీతి సేకోత్థదివ్యనిజసౌరభ మామనామః ॥

శ్రీరంగనాథుడు చేతులతో క్రిందకు వంచబడిన శాఖలనుండి శ్రీరంగ నాయకిచే తన చేతులతో త్రుంచబడినవి, ఆమెచే కర్ణభూషణములు చేసికొనబడినవి అగు పుష్పము కల్గినది, ఎల్లప్పుడు వేయి పాశురములు కల్గిన తిరువాయ్మొవి దివ్యప్రబంధ సారముయొక్క సేచనముచే (తడపుటచే) పుట్టిన అప్రాకృతమైన సువాసనను కల్గినది అగు గొప్ప పొన్నచెట్టును స్తుతింతుము.

**50.** ఇందు సేనాధిపతి అగు విష్వక్సేనులు స్తుతింపబడుచున్నారు.

శ్రీరంగచంద్రమస మిందిరయా విహర్తుం విన్యస్య విశ్వచిదచిన్నయనాధికారమ్।
యో నిర్వహత్యనిశ మంగుళిముద్రయైవ సేనాన్య మన్యవిముఖాః తమశిశ్రియామ ॥

చంద్రునివంటి శ్రీరంగనాథుడు లక్ష్మీదేవితో విహరించుటకు వీలుగా ఆ స్వామిని (శేషశయనమున, లేదా, సింహాసనమున) నిలిపి, సమస్తమైన చేతనాచేతనములను పాలించు అధికారమును ఎల్లప్పుడు తన వేలిముద్రతోనే నిర్వహించు ఆ విష్వక్సేనులను వేఱు శరణము లేనివారమై ఆశ్రయింతుము.

**51.** విష్వక్సేనుల ప్రియపత్ని సూత్రవతి ఇందు కీర్తింపబడుచున్నది.

సైన్యధురీణ ప్రాణసహాయాం సూత్రవతీ మాశ్రిశ్రియ మంబామ్ ।
శ్రీపదలాక్షాలాంఛిత సేవాప్రోతలసద్దోర్వల్లివిలాసామ్ ॥

లక్ష్మీదేవి పాదములకు పూయబడిన లత్తుకచే ముద్రితమైనవి. కైంకర్యము కొఱకై నేయబడినది అగు ప్రోత (నేత) వస్త్రముచే ప్రకాశించునవి. తీగవంటివి అగు బాహువుల యొక్క సౌందర్యమును విష్వక్సేనుల ప్రియ పత్నియు అగు సూత్రవతి కల్గియున్నది. అట్టి ఆ తల్లిని ఆశ్రయించితిని.

**52.** భగవద్రామానుజులు నిత్యగ్రంథమున విష్వక్సేనులకు ప్రణమిల్లిన పిదప, విష్వక్సేనుల పరిజనమగు గజానన, జయత్సేన, హరివక్త్ర, కాలప్రకృతులను నల్గురకు నమస్కరింపవలెనని పల్కిరి. భట్టరు ఆ క్రమమునుబట్టి ఇందు ఆ నల్గురను ప్రార్థించుచున్నారు.

విదధతు సుఖం విష్వక్సేనస్య తే ప్రథమే భటాః
కరిముఖజయత్సేనౌ కాలాహ్వసింహముఖౌ చ నః ।

జగతి భజతాం తత్తత్ప్రత్యూహతూలదవానలా
దిశిదిశి దివారాత్రం శ్రీరంగపాలనకర్మఠాః ॥

ఈ లోకమున తమను ఆశ్రయించువారికి కల్గు ఆ యా ఆటంకములు అను దూదిపింజలను దహించు దావాగ్నివంటివారు, పగలు, రాత్రి ప్రతి దిక్కులోను శ్రీరంగమును పాలించుటను నిత్యకర్మగా కల్గినవారు, విష్వక్సేనులయొక్క ఆ (ప్రసిద్ధులైన) ముఖ్యులైన సేవకులు, కరిముఖుడు, జయత్సేనుడు, కాలుడు, హరివక్త్రుడను పేర్లను కలవారు - అగు నలుగురు మాకు సుఖమును కలుగజేయుదురు గాక!

**53.** భట్టరు ఈశ్లోకమున ''పెరియతిరువడి'' అని సంప్రదాయమున వ్యవహరింపబడు గరుత్మంతుని శరణువేడుచున్నారు. శ్రీరంగాలయమున శ్రీరంగనాథుని కెదురుగా అంజలిముద్రతో వేంచేసియుండు గరుత్మంతులీ శ్లోకమున స్తుతింపబడుచున్నారు.

శ్రుతిమయ మతిహర్షప్రశ్రయస్మేరవక్త్రం
మణిముకుర మివాగ్రే మంగళం రంగధామ్నః
శరణ మభిగతా స్మో యత్ర రూపస్వరూప -
స్వగుణమహిమదర్శీ మోదతే రంగశాయీ ॥

తనకెదురుగా ఉన్న గరుత్మంతునియందు శ్రీరంగనాథుడు తన దివ్యమంగళ రూపము, దివ్యాత్మ స్వరూపము, తన కల్యాణగుణములు - అను వీని గొప్పతనమును చూచుచు సంతోషించుచున్నాడు. అట్టి శ్రీరంగనాథుని ముందు శుభకరమైన రత్నపుటద్దము వలె ఉన్నవాడు, శ్రీరంగనాథుని దర్శనముచే కల్గిన గొప్ప సంతోషముతో, వినయముతో వికసించిన ముఖమండలమును కలవాడు, వేదస్వరూపుడగు ఆ గరుత్మంతుని శరణముగా పొందినవారమై యున్నాము.

**54.** గరుత్మంతునకు సుకీర్తి, రుద్ర అను ఇద్దరు భార్యలు కలరని భగవచ్ఛాస్త్రమున చెప్పబడినది. భట్టరు ఆ క్రమమును అనుసరించి, ఈ శ్లోకమున వారిద్దరిని శరణు వేడుచున్నారు.

తార్క్ష్యపక్షతివదస్య వల్లభాం రుద్రయా సహ సుకీర్తి మర్చయే ।
హర్షబాష్ప మపి కీర్తి మర్థినాం యన్ముఖేన కమలా కటాక్షయేత్ ॥

లక్ష్మీదేవి (తనను) ప్రార్థించువారికి ఆనందాశ్రువులను, కీర్తినికూడ గరుడపత్నుల ద్వారా అనుగ్రహించును. గరుత్మంతునకు, అతని రెక్కల మూలమువలె, మిక్కిలి ప్రియురాండ్రైన సుకీర్తిని, రుద్రాదేవిని అర్చింతును.

**55.** ఈశ్లోకమున భగవానునకు అంతరంగకైంకర్యమును చేయు పంచాయుధములను కవి స్తుతించుచున్నారు.

స్వాస్త్రరూపస్ఫురన్మౌళి మాశబ్ద ఇ - త్యుద్ధునానాన్ సురాన్ తర్జనీముద్రయా ।
నాథనిద్రోచితోన్నిద్రతామ్రేక్షణాం సంచరంతీం స్తుమ స్తాం చ పంచాయుధీమ్॥

తమ తమ అస్త్రరూపములు ప్రకాశించు శిరస్సులను కలవారు, దేవతలను సద్దు చేయకుడని తమ చూపుడు వేలును ఎత్తి చూపు బెదరింపు ముద్రతో బెదరినవారినిగా చేయువారు. శ్రీరంగనాథుని నిద్రకు తగినట్లు రక్షణ చేయువారు, రక్షణ కార్యములో తమకు నిద్రలేకుండ ఉండుటచే ఎఱ్ఱనైన కన్నులను కల్గినవారు, ఎల్లప్పుడు తిరుగాడువారు అగు ఆ పంచాయుధరూపులను కూడ స్తుతించెదము.

**56.** పంచాయుధములలో ప్రధానమగు సుదర్శనచక్రరాజము ఇందు స్తుతింపబడుచున్నది. శ్రీరంగమున శ్రీసుదర్శనమునకు ప్రత్యేకముగా ఆలయముండుట కూడ ఇచట స్మరింపతగినది.

అస్త్రగ్రామాగ్రేసరం నాథవీక్షాసీధు క్షీబోద్వేలనృత్తాభిరామమ్ ।
చక్రం దైత్యచ్ఛేదకల్మాషితాంగమ్ భ్రామ్యజ్జ్వాలామాలభారి ప్రపద్యే ॥

శ్రీరంగనాథుని కటాక్షమనెడి మధుపానమువలన మదమును పొంది, అందువలన చేయు, అలవి కాని నర్తనముచే అందమైనది, అసురుల సంహారముచే కలుషితమైన శరీరమును కల్గినది, సుడులు తిరుగు జ్వాలల సమూహములను కల్గినది, భగవానుని దివ్యాయుధముల సమూహములో ప్రధానమైనదియు అగు సుదర్శనచక్రమును శరణుజొచ్చెదను.

**57.** భట్టరు ఈ శ్లోకమున హనుమద్విభీషణుల రామభక్తిని కొనియాడుచు, వారితో సంబంధమును కలిగియుండవలెను, వారికి సేవచేయువలెను అను అపేక్షను తెలియజేయుచున్నారు.

హనుభూషవిభీషణయోః స్యాం యతమా విహ మోక్ష ముపేక్ష్య ।
రఘునాయకనిష్క్రయభూతం భువి రంగధనం రమయేతే ॥

హనుమంతుడు, విభీషణుడు మోక్షమునుకూడ కాదని, ఈ భూలోకమున

శ్రీరామునకు మూలధనమైన శ్రీరంగనాథుని (కైంకర్యము ద్వారా) సంతోషపెట్టు చున్నారు. అట్టి హనుమంతునియొక్క, విభీషణునియొక్క సంబంధమును కల్గిన వాడనగుదును.

**58.** శ్రీరంగనాథుని ఆలయమున గర్భగృహములోని బాహ్యద్వారప్రదేశమున దారికి అడ్డముగా నిలుపబడినది, దేవాలయ పాలనకైంకర్యమును నిర్వహించునది అగు వేత్రవరమును (బెత్తమును) భట్టరు ఈ శ్లోకమున ప్రస్తుతించుచున్నారు.

ఇతో బహిః పంచ పరాంచి ఖాని ప్రత్యంచి తాని స్యురితో-ంతరిత్థమ్ ।
ఔపాధికేభ్యో నిరుపాధిభోగ్యే ప్రత్యాహర ద్వేత్రవరం ప్రజామి ॥

"అయిదు ఇంద్రియములు ఈ ప్రదేశమునకు బయట బాహ్యవిషయములందు లగ్నమైనవి అగుగాక. ఆ ఇంద్రియములు ఈ ప్రదేశమునకు లోపల "ప్రత్యక్" అగు శ్రీరంగనాథునియందు లగ్నమైనవి అగుగాక" (అని) ఇట్లు సోపాధికములైన లౌకిక విషయములనుండి స్వయంభోగ్యతను కల్గిన శ్రీరంగనాథునియందు మన ఇంద్రియము లను మరల్చు నట్టి, శ్రేష్ఠమైన బెత్తమును శరణువేడెదను.

**59.** వేత్రవరమును దాటి లోనికిపోగానే సాక్షాత్కరించునవి, శ్రీరంగ విమానమునకు ఆధారములైయున్నవి అగు స్తంభములను రెండిటిని భట్టరు ఈ శ్లోకమున స్తుతించుచున్నారు.

శేషశయలోచనామృతనదీ రయాకులితలోలమానానామ్ ।
ఆలంబ మివామోదస్తంభద్వయ మంతరంగ మభియామః ॥

ఆదిశేషునిపై పవళించు శ్రీరంగనాథుని కటాక్షము అను అమృతమయమైన, నదియొక్క ప్రవాహవేగముచే మిక్కిలి కదల్చబడినవారై, అందువలన తడబడు భక్తులకు తగిన ఆధారమువలె ఉన్నవి, శ్రీరంగవిమానములోపల నున్నవి అగు ఆమోద స్తంభములను రెండిటిని సమీపింతుము.

**60.** శ్రీరంగవిమానములోని గర్భాలయ మిందు ప్రస్తుతింపబడుచున్నది.

శ్రీరంగాంతర్మందిరం దీప్రశేషం శ్రీభూమీత్రద్రమ్యజామాతృగర్భమ్ ।
పశ్యేమ శ్రీదివ్యమాణిక్యభూషా మంజూషాయా స్తుల్య మున్మీలితాయాః ॥

తలలపై గల మణులచే ప్రకాశించు ఆదిశేషుని కల్గినది, శ్రీదేవి, భూదేవి ఆ శ్రీరంగనాథుడు - అను వీరిని ముగ్గురిని లోపలి భాగమున కల్గినది, తెరువబడినది,

గొప్పదైన మణులతో చేయబడిన లక్ష్మీదేవి ఆభరణములను దాచు పేటికతో సమానమైనది అగు శ్రీరంగ విమానములోని గర్భగృహమును కన్నులార సేవింతుము.

**61.** శ్రీరంగనాథుని పాదసంవాహనముచేయు పరిచారికలను ఇందు కవి స్తుతించుచున్నారు. ఈ శ్లోకమున చెప్పబడిన కైంకర్యవిశేషములన్నియు భగవచ్ఛాస్త్రానుసారమని తెలియనగును.

లీలాలతాకృపాణీభృంగారపతద్గ్రహార్పితకరాగ్రాః
ప్రోతావతంసితకుచాః పదాబ్జసంవాహినీ ర్వయం స్తుమహే ॥

తీగ (వంటి) కత్తి, బంగారు గిన్నె, తమ్మపడిగము - అను వీనియందు విలాసముగా పెట్టిన చేతుల చివరి భాగములను కలవారు, ఒత్తుట కొఱకు అగు చేనేత వస్త్రములచే అలంకరింపబడిన స్తనములను కలవారు, శ్రీరంగనాథుని పాదారవిందములను సంవాహనము చేయువారగు పరిచారికలను మనము స్తుతింతుము.

**62.** భగవద్రామానుజులు ''నిత్యగ్రంథమున'' తొమ్మిదిమంది చామర గ్రాహిణులను పేర్కొనిరి. ఆగమములలో కూడ తొమ్మిదిమంది చామరగ్రాహిణులు పేర్కొనబడిరి. భట్టరు ఆ క్రమమును అనుసరించి ఈ శ్లోకమున చామరకైంకర్యమునుచేయు పరిచారికలను స్తుతించుచున్నారు.

ముకుళితనళినాః సకౌముదీకా ఇవ సునిశావిమలాదికా నవాపి ।
శిరసి కృతనమస్యదేకహస్తా ఇతరకరోచ్చలచామరా శ్రయేయమ్ ॥

ఒక చేతిని తలపై పెట్టుకొని నమస్కరించుచున్నవారు, వేఱొక చేతితో పైకి చామరములను వీచువారు, కావుననే ముడుచుకొనిన తామరపూవులను కల్గినవి, వెన్నెలతో కూడినవి అగు అందమైన రాత్రులవలె ఉన్నవారగు విమల మొదలగు తొమ్మిదిమంది చామరగ్రాహిణిలను కూడ ఆశ్రయింతును.

**63.** శ్రీరంగరాజస్తవమున 1వ శ్లోకము నుండి 62వ శ్లోకము వరకు గల భాగము అవతారిక వంటిది. శ్రీరంగనాథుని స్తవము ఈ శ్లోకమునుండి ప్రారంభమగుచున్నది. ఈ స్తుతి పూర్వశతకము చివరివరకు కొనసాగును. 63వ శ్లోకము నుండి 76వ శ్లోకము వరకు ''నమ్బెరుమాళ్'' అను పేరుతో ప్రసిద్ధులగు ఉత్సవమూర్తి 77వ శ్లోకము నుండి చివరివరకు ''పెరియపెరుమాళ్'' అని పిలువబడు మూలమూర్తియు స్తుతింపబడుచున్నారు.

ఉత్ఫుల్లపంకజతటాక మివోపయాని శ్రీరంగరాజ మిహ దక్షిణసవ్యసీమ్నోః

।

లక్ష్మీం విహారరసికా మివ రాజహంసీం ఛాయా మివాభ్యుదయినీ మవనీం చ తస్యాః ॥

ఈ శ్రీరంగమందిర గర్భగృహములో, బాగుగా వికసించిన తామరపూలను కల్గిన సరస్సువలె ప్రకాశించు శ్రీరంగనాథుని ఆశ్రయింతును. అతని కుడివైపు, ఎడమవైపు శ్రీదేవి, భూదేవి వేంచేసిఉన్నారు. శ్రీరంగనాథుడను ఆ సరస్సులో విహరించుటలో ఆసక్తిని కల రాజహంసి (ఆడురాజహంస) వలె లక్ష్మీదేవి ఉన్నది. ఆ లక్ష్మీదేవియొక్క ఉత్తరోత్తరాభివృద్ధిని కల్గిన నీడవలె భూదేవి ఉన్నది. వారిని అందరిని ఆశ్రయింతును.

**64.** ముందుశ్లోకమున శ్రీరంగనాథుని కవి పద్మసరస్సుగా అభివర్ణించిరి. ఆ రూపణములోని భోగ్యతాతిశయమువలన వివశులైన భట్టరు మరల ఆ భావమునే భిన్న పదములతో అనుసంధించుచున్నారు.

పిబ నయన! పుర స్తే రంగధుర్యాభిధానం
స్థిత మిహ పరిఫుల్లత్పుండరీకం తటాకమ్ ।
శ్రియ మపి విహరంతీం రాజహంసీ మివాస్మిన్
ప్రతిఫలన మివాస్యాః పశ్య విశ్వంభరాం చ ॥

ఓ నేత్రమా! ఈ గర్భగృహమందు నీ ఎదుట ఉన్నది, బాగుగా వికసించిన తామర పూలను కల్గినది, శ్రీరంగనాథుడను పేరును కల్గినది అగు సరస్సును దర్శించుము. ఈ సరస్సులో విహరించుచున్న ఆడుహంసవలె ఉన్న లక్ష్మీదేవిని, ఈ లక్ష్మీదేవి ప్రతిరూపమువలె ఉన్న భూదేవినికూడ సేవింపుము.

**65.** ఈ శ్లోకమున కూడ శ్రీరంగనాథుడు పద్మసరస్సుగా రూపింపబడుచున్నాడు.

సౌశీల్యశీతల మవేలకృపాతరంగ -
సంప్లావితాఖిల మకృత్రిమభూమనిమ్నమ్ ।
లక్ష్మ్యా చ వాసిత మభూమ విగాహమానాః
శ్రీరంగరాజమిషపద్మసరః ప్రసన్నమ్ ॥

సౌశీల్యగుణముచే చల్లనిది, అవధి లేని కరుణ అనెడు కెరటములతో పూర్తిగా సమస్తజనమును ఆనందింపచేయునది, సహజమైన గొప్పతనమును కల్గినది (విస్తృత మైనది), లోతైనది (తెలుసుకొనుటకు సాధ్యము కాని స్వరూపరూప గుణవిభూతులను కల్గినది) అయినను, లక్ష్మీదేవిచే పరిమళింపచేయబడినది (నివసింపబడినది), తేటనైనది అగు శ్రీరంగనాథుడను పద్మసరస్సున అవగాహనము చేయువారము (నీరాడువారము) అయితిమి.

**66.** శ్రీదేవి, భూదేవులతో కలసి సింహాసనమున వేంచేసియుండు శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిసన్నివేశమును కవి ఈ శ్లోకమున అనుభవించుచున్నారు.

**సింహాసనే కమలయా క్షమయా చ విశ్వ-మేకాతపత్రయితు మస్మదసూన్ నిషణ్ణమ్।**
**లక్ష్మీస్వయంవర సనాథితయౌవనశ్రీ-సౌందర్యసంపదవలిప్త మివా లిహీయ॥**

**సమస్త చరాచరప్రపంచమును ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించుటకు (ఒకే గొడుగును కల్గినదిగా చేయుటకు) లక్ష్మీదేవితో భూదేవి తోను సింహాసనమున వేంచేసియున్నవాడు, మాకు ప్రాణమైనవాడు, లక్ష్మీదేవియొక్క స్వయంవరముచే కృతార్థ మైన యౌవనశోభతో, సౌందర్య సంపదతో గర్వించినవానివలె ఉన్నవాడగు శ్రీరంగ నాథుని ఆస్వాదింతును (దర్శింతును).**

**67.** క్రిందటిశ్లోకమున శ్రీరంగనాథుని పరత్వమును అనుభవించిన భట్టరు, పరత్వ సౌలభ్యములు రెండును ఆశ్రయణమునకు ఆవశ్యకములగుటచే ఆ రెంటిని కలిపి ఈ శ్లోకమున అనుభవించుచున్నారు.

**ఆపాదమూలమణిమౌళి సముల్లసంత్యా**
**స్వాతంత్ర్యసౌహృదతరంగితయా -ంగభంగ్యా ।**
**సఖ్యం సమస్తజనచేతసి సందధానం**
**శ్రీరంగరాజ మనిమేష మనుప్రియాస్మ ॥**

**పాదములు మొదలు శిరస్సువరకు ప్రకాశించు స్వాతంత్ర్యగుణముచే (పరత్వముచే), సౌహృదగుణముచే (సౌలభ్యగుణముచే) తరంగితమైన (అలలతో కూడుకొనియున్న) అవయవముల సన్నివేశముతో, జనులందరియొక్క మనస్సున స్నేహమును (అనురాగమును, విశ్వాసమును) కలిగించువాడగు శ్రీరంగనాథుని కనురెప్పపాటు లేకుండునట్లు అనుసరింతుము.**

**68.** ఈశ్లోకమున కవి శ్రీరంగనాథుని కల్పవృక్షముతో పోల్చుటద్వారా వర్ణించుచున్నారు.

**క్షితికమలనివాసాకల్పవల్లీసలీలో -**
**ల్లుఠనదశదిశోద్యద్యౌవనారంభజృంభః ।**
**శ్రమ మపహరతాం మే రంగధామేతి తత్తత్ -**
**వరమయఫలనమ్రః పత్రలః పారిజాతః ॥**

**భూదేవి, లక్ష్మీదేవి అను కల్పలతల విలాసముతోకూడిన ఆలింగనములచే (పరివేష్ఠనములచే) పది దిక్కులలోను ప్రకాశించు యౌవనారంభమును కల్గినది, ఆకులతో నిండినది, ఆ యా వరములనెడు ఫలములతో (కొంచెము) వంగినది**

**అగు శ్రీరంగ నాథుడను పారిజాతవృక్షము నా శ్రమను పోగొట్టుగాక !**

**69.** శ్రీరంగనాథుని ఉత్సవమూర్తి సన్నివేశమును ఇందు భట్టరు స్తుతించుచున్నారు. పూర్వశ్లోకమున మాటలాడనేరని కల్పవృక్షముతో రంగనాథునిపోల్చిన కవి ఇందు మాటలాడువృక్షముగా వర్ణించుచున్నారు.

సంభాషమాణ మివ సర్వవశంవదేన
మందస్మితేన మధురేణ చ వీక్షణేన ।
దివ్యాస్త్రపుష్పితచతుర్భుజ మత్యుదారం
రంగాస్పదం మమ శుభాశ్రయ మాశ్రయాణి ॥

**అందరిని వశము చేసికొను, తీయనైన చిఱునవ్వుతో, చూపుతోను మాటలాడునట్లున్నవాడు, గొప్పవైన (అప్రాకృతములైన) ఆయుధములతో పుష్పించు నట్లుండు నాల్గు భుజములను కలవాడు, మిక్కిలి ఉదారుడు, నాకు మంగళకరమైన ఆశ్రయమైనవాడు, శ్రీరంగమును నిలయముగా కలవాడును అగు శ్రీరంగనాథుని ఆశ్రయింతును.**

**70.** దివ్యాయుధములతో, అభయముద్రతో కూడిన శ్రీరంగనాథుని ఉత్సవమూర్తియొక్క సన్నివేశమున భట్టరు ఇందు రమ్యమైన ఉత్ప్రేక్షతో స్తుతించుచున్నారు.

ఏతే శంఖగదాసుదర్శనభృతః క్షేమంకరా బాహవః
పాదద్వంద్వ మిదం శరణ్య మభయం భద్రం చ వో హే జనాః ।
ఇత్యూచుష్యభయంకరే కరతలే స్మేరేణ వక్త్రేణ తత్
వ్యాకుర్వన్నివ నిర్వహే న్మమ ధురం శ్రీరంగసర్వంసహః ॥

**"ఓ జనులారా! (పాంచజన్యమను) శంఖము, (కామోదకి అను) గద, సుదర్శన చక్రము - అను ఆయుధములను ధరించు ఈ బాహువులు మీకు క్షేమమును కల్గించునవి. ఈ పాదముల జంట మీకు గొప్ప రక్షకము. భయమును తీర్చునది. మంచిని కల్గించునది కూడ" - అని అభయమును కల్గించు ముద్రతోకూడిన శ్రీరంగనాథుని చేయి పల్కుచున్నది. ఆ విషయమును చిఱునవ్వును కల ముఖముతో వ్యాఖ్యానించువానివలె శ్రీరంగనాథుడు ఉన్నాడు. అతడు నా భారమును నిర్వహించును గాక! (పూర్తిగా వహించునుగాక).**

**71.** శ్రీరంగనాథుని అవయవసన్నివేశమును దర్శించిన కవి నిత్యనూతనమై అలరారు స్వామిని పూర్ణముగా అనుభవించుట సాధ్యము కాదను విషయమును ఇందు

ఆశ్చర్యపూర్వకముగా వర్ణించుచున్నారు.

అఙ్గై రహంప్రథమికాచరితాత్మదానైః
ఆమోదమాన నవయౌవనసావలేపైః ।
హై పారిజాత మివ నూతనతాయమాన -
శాఖాశతం కథ మధీమహి రంగధుర్యమ్ ॥

భక్తులకు అనుభవవిషయము అగుటలో "నేను ముందు నేను ముందు" అని ఒకదానికంటే ఇంకొకటి ముందుకు వచ్చునవి, భగవదనుభవమును భక్తులకు అందునట్లు వితరణములను చేయునవి, (కావుననే) పరిమళించునట్టి (మిక్కిలి సంతోషించునట్టి) క్రొత్తదైన యౌవనముచే గర్వముతో కూడినవి అగు తన దివ్యమైన అవయవములతో శ్రీరంగనాథుడు, నిత్యనూతనముగానున్న, పలుశాఖలను కల పారిజాతవృక్షమువలె ఉన్నాడు. ఆ శ్రీరంగనాథుని ఎట్లు అనుభవింపగలము? ఆశ్చర్యము!

**72.** శ్రీరంగనాథుని శృంగారరసమూర్తిగా రూపించుచు కవి తదనుగుణముగా ఇందు కొన్ని అపూర్వములైన విభావానుభావములను ప్రతిపాదించుచున్నారు.

ఆలోకా హృదయాలవో రసవశాన మీషత్స్మితం
ప్రచ్ఛాయాని వచాంసి పద్మనిలయాచేతఃశరవ్యం వపుః ।
చక్షుష్మంతి గతాగతాని త ఇమే శ్రీరంగశృంగార! తే
భావా యౌవనగంధినః కి మపరం సించంతి చేతాంసి నః ॥

శ్రీరంగమున శృంగారరసము మూర్తీభవించినట్లున్న శ్రీరంగనాథస్వామీ! నీ కటాక్షములు (ఆశ్రితులపట్ల) ప్రేమను కల్గినవి. మందహాసము (చిఱుదరహాసము) ప్రణయరసమువలన అందరిని వశపఱచుకొనునది. పలుకులు (సంసార తాపమును తీర్చు) నీడనిచ్చునవి. దివ్యమంగళ విగ్రహము లక్ష్మీదేవియొక్క మనస్సును లక్ష్యముగా కల్గినది.తిరువీథులలోని రాకపోకలు కన్నుల కింపైనవి. వేఱొకటి ఏమి? ఆ ఈ (ఇట్టి) యౌవనమును సూచించునట్టి నీ విషయములు అన్నియు (దాసులమైన) మాయొక్క మనస్సులను (తడపుచున్నవి) చల్లపఱచుచున్నవి.

**73.** 65వశ్లోకమున ''ప్రసన్నం శ్రీరంగరాజమిషపద్మసరః విగాహమానాః అభూమ'' అనుచు భగవదనుభవమజ్జనమును ప్రస్తుతించినకవి ఇందు అట్టి మజ్జనమును చేయుటలో

సిద్ధహస్తులగు నమ్మాళ్వార్ల రీతిని అనుసరించుచున్నారు.

**ఆయత్కిరీట మళికోల్లసదూర్ధ్వపుంధ్ర - మాకర్ణలోచన మనంకుశకర్ణపాశమ్ ।**
**ఉత్ఫుల్లవక్షస ముదాయుధబాహు మర్ధ్వ - న్నీవీం చ రంగపతి మబ్జపదం భజామ ॥**

**ఎత్తైన కిరీటమును కల్గినవాడు, లలాటమున విలసిల్లు ఊర్ధ్వపుండ్రమును కలవాడు, చెవులవరకు విస్తరించిన విశాలములైన నేత్రములను కల్గినవాడు, అడ్డు లేని (పాశమువంటి) గొప్ప కర్ణములను కల్గినవాడు, విశాలమైన వక్షఃస్థలమును కలవాడు, గొప్ప ఆయుధములను (లేక, పైకెత్త బడిన ఆయుధములను) కల బాహువులను కల్గినవాడు, ప్రకాశించు వస్త్రబంధమును, పద్మములవంటి పాదములను కలవాడును అగు శ్రీరంగనాథుని సేవింతుము.**

**74.** ఈశ్లోకము కూడ పూర్వశ్లోకమువలెనే శ్రీరంగనాథుని దివ్యమంగళరూపమును వర్ణించుచున్నది. కాని ఇందు పాదపీఠాదిముఖపర్యంతవర్ణనము చేయబడినది.

**అబ్జన్యస్తపదాబ్జ మంచితకటీసంవాది కౌశేయకమ్**
**కించిత్తాండవగంధిసంహననకం నిర్వ్యాజమందస్మితమ్ ।**
**చూడాచుంబిముఖాంబుజం నిజభుజావిశ్రాంతదివ్యాయుధమ్**
**శ్రీరంగే శరదశ్శతం తత ఇతః పశ్యేమ లక్ష్మీసఖమ్ ॥**

**ఆసనపద్మమున నిలుపబడిన తామరలవంటి పాదములను కలవాడు, అందమైన నడుముకు తగిన పీతాంబరమును కలవాడు, కొద్దిపాటి నాట్యభంగిమతో ప్రకాశించు దివ్యమంగళ రూపమును కలవాడు, స్వభావసిద్ధమైన చిఱునవ్వును కలవాడు, కిరీటమును స్పృశించు పద్మమువంటి ముఖమును కలవాడు, తన బాహువులయందు విశ్రమించిన గొప్ప ఆయుధములను కలవాడగు శ్రీరంగనాథుని శ్రీరంగమున అక్కడ, ఇక్కడ అంతట దర్శింతుము గాక!**

**75.** కవి శ్రీరంగనాథుని ఈ శ్లోకమున అపర్యాప్తామృతముగా (ఆరావముదమ్) స్తుతించుట విశేషము. నమ్మాళ్వార్లు భగవానుని ''ఆరావముదే'' (తి.వా. 5-8-1) అని ప్రస్తుతించుట ఈ రూపణమునకు నిదానమని చెప్పవచ్చును.

**అగ్రే తార్క్ష్యేణ పశ్చా దహిపతిశయనేనాత్మనా పార్శ్వయో శ్చ**
**శ్రీభూమిభ్యా మతృప్త్యా నయనచులకనైః సేవ్యమానామృతౌఘమ్ ।**
**వక్త్రేణావిఃస్మితేన స్ఫురదభయగదాశంఖచక్రైః భుజాగ్రైః**
**విశ్వస్మై తిష్ఠమానం శరణ మశరణా రంగరాజం భజామః ॥**

ముందు భాగమున గరుత్మంతునిచే, వెనుక భాగమున శేషశయనుడగు తనచే (శ్రీరంగనాథునిచే), మఱియు, రెండువైపుల లక్ష్మీదేవి, భూదేవులచే సంతృప్తి లేకుండుటచే నేత్రములు అను పుడిసిళ్లతో నిత్యము సేవింపబడుచున్న (తన సౌందర్యమనెడి) అమృతప్రవాహ మును కలవాడు, చిఱునవ్వు తొణకిసలాడు ముఖముతో ప్రకాశించు వాడు, అభయహస్తము, గద, శంఖము, చక్రము - అను వీనిని దాల్చిన భుజాగ్రములతో (కరములతో) అందరకు తన మనస్సును తెలియజేయుచు నిలచియున్నవాడగు శ్రీరంగనాథుని వేఱొక దిక్కు లేనివారమై సేవింతుము.

**76.** ఈ స్తవమున భట్టరు 63వ శ్లోకము మొదలు ముందుశ్లోకమువరకు - అనగా 13శ్లోకములలో శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిని ఉపాయముగా స్తుతించిరి. ఇందు ఆ స్వామిని ఉపేయముగా ''అస్మద్ధనం'' అనుచు స్తుతించుచున్నారు.

ఆర్తాపాశ్రయ మర్థికల్పక మసహ్యాగస్కరక్ష్మాతలమ్
సద్యః సంశ్రితకామధేను మభియత్సర్వస్వ మస్మద్ధనమ్ ।
శ్రీరంగేశ్వర మాశ్రయేమ కమలాచక్షు ర్మహీజీవితమ్
శ్రీరంగే స సుఖకరోతు సుచిరం దాస్యం చ ధత్తాం మయి ॥

బాధను పొందినవారికి (గొప్ప) ఆశ్రయము (ఆలంబనము), అర్థించు జనులకు కల్పవృక్షము. సహింపరాని పాపము చేసినవారిపట్ల భూతలము (క్షమను కలవాడు). అపుడే ఆశ్రయించినవారికి కామధేనువు. ఆళ్వార్లవంటి ముముక్షువులకు సర్వస్వము. మాకు సంపద. శ్రీదేవికి నేత్రము. భూదేవికి జీవితము. అట్టి శ్రీరంగనాథుని ఆశ్రయింతుము గాక. ఆ ప్రభువు చిరకాలము శ్రీరంగమున (మమ్ములను) సుఖింప జేయుగాక! నాకు దాస్యవృత్తిని (కైంకర్యవృత్తిని) కూడ అనుగ్రహించునుగాక!

**77.** ఈశ్లోకము మొదలుకొని శ్రీరంగనాథుని మూలమూర్తి స్తుతింపబడుచున్నాడు.

స్వఫణవితానదీప్రమణి మాలిసుదామరుచి -
ప్రమదిమసుగంధిభోగ సుఖశాయితరంగధనమ్ ।
మదభరమంథరోచ్ఛ్వసితనిశ్శ్వసితోత్తరళమ్
ఫణిపతిడోలికాతళిమ మాశ్వసిమః ప్రణతాః ॥

ఆదిశేషుడను తూగుటుయ్యాల మంచము తన పడగలనెడు మేలుకట్టులో

ప్రకాశించు మణుల వరుసలను కల్గినది. చక్కని పూలమాలెలయొక్క అందమును, మెత్తనిదనమును, పరిమళమును కల్గిన తన శరీరము నందు సుఖముగా శయనింప జేసిన, శ్రీరంగములో ధనమువంటి వాడైన, శ్రీరంగనాథుని కల్గినది. భగవదనుభవముచే కల్గిన మదముచే మెల్లగా కదలునది, ఉచ్ఛ్వాస నిఃశ్వాసము లచే పైకి కిందకు ఊగునట్టిది. అట్టి గొప్పదైన ఆదిశేషుని రూపములోని తూగుటుయ్యలను నమస్కరించు వారమై ఓదార్పునొందితిమి.

**78.** ఈశ్లోకమునుండి అనంతశాయి అగు శ్రీరంగనాథుని మూలమూర్తి స్తోత్రము ప్రారంభమగుచున్నది.

వటదళదేవకీజఠర వేదశిరఃకమలా -
స్తనశఠకోపవాగ్వపుషి రంగగృహే శయితమ్ ।
వరద ముదారదీర్ఘభుజలోచనసంహననం
పురుష ముపాసిషీయ పరమం ప్రణతార్తిహరమ్ ॥

మఱ్ఱి చిగురుటాకులో దేవకీదేవిగర్భములో, వేదాంతములలో, లక్ష్మీవక్షోజము లలో, నమ్మాళ్వార్ల శ్రీసూక్తి అగు తిరువాయ్‌మొళిలో, వారి తిరుమేనిలో, అదేవిధముగా, వీటివలె భోగ్యమైన శ్రీరంగవిమానములో శయనించినవాడు, వరముల నొసగువాడు, గొప్ప పొడవైన భుజములను, కన్నులను కల రూపమును కలవాడు, తనకు నమస్కరించినవారి ఆర్తిని పోగొట్టువాడు, పరమపురుషుడగు శ్రీరంగనాథుని ఉపాసింతును.

**79.** ఈ శ్లోకమున కవి అర్చామూర్తియొక్క వైభవమును పరోక్షముగా శ్రీరంగనాథుని స్తుతించుటద్వారా వర్ణించుచున్నారు.

ఉదధిపరమవ్యోమ్నోః విస్మృత్య పద్మవనాలయా -
వినిమయమయీం నిద్రాం శ్రీరంగనామని ధామని ।
ఫణిపరిబృఢస్ఫార ప్రశ్వాసనిశ్శ్వసితక్రమ -
స్థలితనయనం తన్వన్ మన్వీత నః పరమః పుమాన్ ॥

పాలసముద్రమును, పరమపదమును మఱచి, లక్ష్మీదేవిని కొంచెముసేపు చూచుట, మఱికొంచెము సేపు యోగనిద్రను పొందుట - అను పరివృత్తిని కల నిద్రను శ్రీరంగమను పేరు కల కోవెల యందు పొందువాడు, ఆదిశేషునియొక్క, అధికమైన ఉచ్ఛ్వాసనిశ్శ్వాసముల క్రమముచే (వరుసచే) తొట్రుపాటు పడు నేత్రములను కల్గినవాడు, పరమపురుషుడగు శ్రీరంగనాథుడు మనలను దయతో అనుగ్రహించును గాక!

**80.** ఈ శ్లోకమున భట్టరు నల్లని శ్రీరంగవిమానమున పరుండియున్న శ్రీరంగనాథుని మూడు అపూర్వములైన ఉపమలతో వర్ణించుచున్నారు.

జలధి మివ నిపీతం నీరదే నాద్రిమబ్ధౌ
నిహితమివ శయానం మంజరం వా-ద్రికుంజే ।
కమలపదకరాక్షం మేచకం ధామ్ని నీలే
ఫణిన మధిశయానం పూరుషం వందిషీయ ॥

నల్లనివాడు, శ్రీరంగవిమానమునందు ఆదిశేషునిపై పరుండియున్నవాడు, కమలములవంటి పాదములను, చేతులను, కన్నులను కలవాడు, మేఘముచే పూర్తిగా పానము చేయబడిన సముద్రమువలె ఉన్నవాడు, సముద్రమున నిలుపబడిన పర్వతమువలె ఉన్నవాడు, పర్వతమునందలి పూపొదరింటిలో పరుండిన ఏనుగువలె ఉన్నవాడు, పరమపురుషుడగు శ్రీరంగనాథుని నమస్కరింతుము గాక!

**81.** ముందు శ్లోకమున కవి శ్రీరంగనాథుని సముద్రముతో ఉపమించెను. ఈ శ్లోకమున ఆ ఉపమానమునకు మరింత మెఱుగును దిద్దుచు అపూర్వమైన ఉత్ప్రేక్షతో వర్ణించుచున్నారు.

శ్రీరంగేశయ ఇహ శర్మ నిర్మిమీతా మాతామ్రాధర పదపాణివిద్రుమో నః ।
కావేరీలహరికరోపలాల్యమానో గంభీరాద్భుత ఇవ తర్ణకో-ర్ణవస్య ॥

అంతట మిక్కిలి ఎఱ్ఱనివి అయిన కింది పెదవి (అధరము), పాదములు, హస్తములు-అను పగడములను కల్గినవాడు, కావేరీనదియొక్క కెరటములు అను చేతులతో లాలింపబడుచున్నవాడు, గంభీరమైన, ఆశ్చర్యకరమైన సముద్రముయొక్క శిశువువలె ఉన్నవాడగు శ్రీరంగనాథుడు మనకు ఈ లోకమున సౌఖ్యమును కలుగజేయును గాక!

**82.** ముందుశ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని సముద్రపోతముగా వర్ణించిరి. ఈ శ్లోకమున శ్రీరంగనాథుని శీతలకాళమేఘముగా సావయవరూపకముతో వర్ణించుచున్నారు.

సించేదిమం చ జన మిందిరయా తటిత్వాన్ భూషామణిద్యుతిభి రింద్రధనుర్దధానః ।
శ్రీరంగధామని దయారసనిర్భరత్వాత్ అద్రౌ శయాళు రివ శీతలకాలమేఘః ॥

లక్ష్మీదేవి అను మెఱపుతీగను కల్గినవాడు, నగలలో పొదగబడిన, అనేక రంగులలోని మణుల కాంతులచే ఇంద్రధనుస్సును కల్గినవాడు, దయ అను నీటితో నిండియుండువాడు, కావుననే శ్రీరంగము అను పర్వతమునందు శయనించునట్టి చల్లని, నల్లని మేఘమువలె ఉన్నవాడగు శ్రీరంగనాథుడు ఈ దాసునికూడ కరుణా రసముతో అభిషేకించును గాక!

**83.** ఈ శ్లోకమున కవి శ్రీరంగనాథుని అమృత ప్రవాహముగా అభివర్ణించుచున్నారు.

**ఆమౌళిరత్నమకరాత్ పునరాచ పద్భ్యామ్ ధామక్రమోన్నమదుదారమనోహరాంగమ్।**
**శ్రీరంగశేషశయనం నయనైః పిబామ పశ్యన్మనఃప్రవణమోఘ మివామృతస్య ॥**

**కిరీటమునందు మొసలిరూపములో పొదగబడిన రత్నములనుండి పాదముల వరకు గల తేజస్సుల వరుసచే ఉన్నతములై వర్ధిల్లుచున్నవి, గొప్పవి, మనస్సును ఆకర్షించునవి అగు అవయవములను కలవాడు, శ్రీరంగమున ఆదిశేషుని శయనముగా కలవాడును అగు శ్రీరంగనాథుడు తనను దర్శించువారి మనస్సులో తానే వచ్చి ప్రవహించు అమృతము ప్రవాహము వలె ఉన్నాడు. ఆ స్వామిని కన్నులతో పానము చేయుచున్నాము (అనుభవించుచున్నాము).**

**84.** దేవలోకములో అమృతముతోపాటు నందనవనమును ఉండును కదా! గతశ్లోకమున శ్రీరంగనాథుని అమృతప్రవాహముగా వర్ణించినకవి ఇందు శ్రీరంగనాథుని నందనవనముగా అద్భుతమైన ఉత్ప్రేక్షతో భట్టరు స్తుతించుచున్నారు.

**అరవిందిత మంఘ్రిపాణివక్త్రైః అపి తాపింఛిత మంచితాంగకాంత్యా।**
**అధరేణ చ బంధుజీవితం శ్రీః నియతం నందనయేత రంగచంద్రమ్ ॥**

**తామరపూవులవంటి పాదములను, కరములను, ముఖములను కల్గినవాడు, తమాలపుష్పముల కాంతివంటి అందమైన (గొప్పదైన) తన దేహకాంతిని కల్గినవాడు, మంకెన పువ్వువంటి అధరములను కల్గినవాడు, చంద్రునివంటివాడైన శ్రీరంగనాథుని లక్ష్మీదేవి తప్పక నందనవనముగా తలచి ఆనందించును గాక!**

**85.** ఈ శ్లోకమును ''తనకు తగినవి, సాటిలేనివి, చిన్మయములు కావున స్వయం ప్రకాశములు, పరస్పరము కాంతిని ఇనుమడింపచేసికొనునవి అగు వనమాల, పీతాంబరము, ఆభరణములతో కూడినవానిని'' అను పౌష్కరసంహితలోని ప్రమాణశ్లోకమును దృష్టిలో నుంచుకొని భట్టరు రచించినట్లు తోచును.

**అన్యోన్యరంజకరుచో-నుపమానశోభాః**
**దివ్యస్రగంబరపరిష్కరణాంగరాగాః।**
**సంస్పర్శతః పులకితా ఇవ చిన్మయత్వాత్**
**రంగేందుకాంతి మధికా ముపబృంహయంతి ॥**

**పరస్పరము శోభను కల్గించు కాంతిని కల్గినవి, సాటి లేని శోభను కల్గినవి అగు వనమాల, పీతాంబరము, ఆభరణములు, మైపూతలు - అను ఇవి చైతన్యరూపమును కల్గినవి అగుటచే శ్రీరంగనాథుని దివ్యదేహస్పర్శవలన గగుర్పాటును**

పొందినవి వలె తోచుచు, మిక్కుటమైన చంద్రునివంటి శ్రీరంగనాథుని శోభను వృద్ధిపఱచుచున్నవి.

**86.** పెరియాళ్వార్లు, పేయాళ్వార్లు భగవానునిరూపము మరతకమణిసదృశమని స్తుతించిరి. ఇట్లే మరికొందఱు ఆళ్వార్లును ఇట్టి వర్ణనను చేసిరి. కవి ఆ క్రమమును అనుసరించుచు ఇందు శ్రీరంగనాథుని అపూర్వమైన ఉత్ప్రేక్షద్వారా మరతకమణిరూపిగా వర్ణించుచున్నారు.

ద్రుతకనకజగిరి పరిమిళదుదధి ప్రచలితలహరివ దహమహమికయా ।
స్నపయతి జన మిమ మపహరతి తమః ఫణిశయమరతక మణికిరణగణః ॥

ఆదిశేషునిపై పరుండియుండు శ్రీరంగనాథుడనెడి మరతకమణి నుండివెలువడు కాంతిసమూహము, కఱగి స్రవించిన మేరుపర్వతముతో కలసియున్న సముద్రము నుండి పైకెగసిన కెరటములవలె, 'నేను ముందు నేను ముందు' అనునట్లుగా ఈ దాసుని స్నానము చేయించుచున్నది (మనస్సులోని) చీకటిని పోగొట్టుచున్నది.

**87.** ఈ శ్లోకమున కవి శ్రీరంగనాథుని సౌరభ్యగుణమును స్తుతించుచున్నారు.

భోగీంద్రనిశ్శ్వసితసౌరభవర్ధితం శ్రీనిత్యానుషక్తపరమేశ్వరభావగంధి ।
సౌరభ్య మాప్లుతదిశావధి రంగనేతుః ఆనందసంపది నిమజ్జయతే మనాంసి ॥

ఆదిశేషుని నిట్టూర్పుల పరిమళముచే పెంపొందింపబడినది లక్ష్మీదేవియొక్క నిత్యసంశ్లేషముచే ఏర్పడిన సర్వేశ్వర్వముయొక్క సువాసనను కల్గినది దిక్కుల చివరివరకును వ్యాపించినదియు అగు శ్రీరంగనాథునియొక్క తిరుమేనిపరిమళము భక్తుల మనస్సులను ఆనందమనెడి సంపదయందు ఓలలాడించుచున్నది.

**88.** ముందుశ్లోకమున శ్రీరంగనాథుని సౌగంధ్యమును ప్రస్తావించిన భట్టరు ఇందు స్వామి సౌకుమార్యమును ప్రస్తుతించుచున్నారు.

రంగభర్తు రపి లోచనచర్చాం సాహసావళిషు లేఖయమానమ్ ।
పుష్పహాస ఇతి నామ దుహానం సౌకుమార్య మతివాఙ్మనసం నః ॥

చూచువారి చూపుల లేపనమును(ప్రసరణమును) కూడ సహించనది, "పుష్పహాసః" అను పేరును సార్థకము చేయునది అగు శ్రీరంగనాథుని సౌకుమార్య గుణము మన వాక్కుకు, మనస్సుకు అందనిది.

**89.** సౌందర్యము అనగా ప్రత్యంగశోభ. లావణ్యము ఆ అంగముల కలయిక వలన ఏర్పడు సముదాయ శోభ. కవి ఇచట చమత్కారముగా తన నేత్రమును సంబోధించుచు, ఈ రెండిటిని వర్ణించుచున్నారు.

**ఏకైకస్మిన్ పరమవయవే- నన్తసౌందర్యమగ్నం**
**సర్వం ద్రక్ష్యే కథ మితి ముధా మా మథా మందచక్షుః! ।**
**త్వాం సౌభ్రాత్రవ్యతికరకరం రంగరాజాంగకానాం**
**తల్లావణ్యం పరిణమయితా విశ్వపారీణవృత్తి ॥**

**లావణ్య గుణము అనునది ఒకటి ఉన్నదని తెలియని ఓ మూఢమైన నేత్రమా! శ్రీరంగనాథుని ఒక్క అవయవములోని మిక్కిలి అంతులేని సౌందర్యముననే మునిగిన (నేను) అన్ని అవయవములలోని సౌందర్యమునంతటిని ఎట్లు దర్శింతును? అని వ్యర్థముగా శంకింపకుము. శ్రీరంగనాథుని అవయవములకు మధ్య సౌహార్ద సంబంధ మును కల్గించు ఆ లావణ్యము నిన్ను అన్ని అవయవములను పూర్తిగా అనుభవించు దానినిగా నెఱవేర్చును (చేయును).**

**90.** ఈ శ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని అలౌకికతారుణ్యశోభను రమణీయమైన రూపకము ద్వారా వర్ణించుచున్నారు.

**వపు ర్మందారస్య ప్రథమకుసుమోల్లాసమయః**
**క్షమాలక్ష్మీభృంగీ సకలకరణోన్మాదనమధు ।**
**వికాసః సౌందర్యస్రజి రసికతాశీధుచుళకో**
**యువత్వం రంగేందోః సురభయతి నిత్యం సుభగతామ్ ॥**

**చంద్రునివంటి శ్రీరంగనాథుని నిత్యమైన యౌవనము, ఆ స్వామి యొక్క శరీరమనెడి మందారవృక్షము మొదటిగా పూవుయొక్క పుష్పించు సమయము (పరువము). భూదేవి, లక్ష్మీదేవి - అను ఆడుతుమ్మెదల సమస్త ఇంద్రియములకు మిక్కిలి మత్తును కల్గించు మధువు. అందము అను పూమాలలోని వికాసము. రాసిక్యమనెడి మధువునకు పుడిసిలి. అది ఆస్వామికి నిత్యము సౌభాగ్యమును పరిమళింప జేయుచున్నది.**

**91.** ఈ శ్లోకమునుండి శతకము చివరివరకు వరుసగా కిరీటముమొదలు పాదములవరకు గల స్వామి దివ్యరూపమును స్తుతించుచున్నారు.

**కిరీటచూడరత్నరాజి రాధిరాజ్యజల్పికా ।**

ముఖేందుకాంతి రున్ముఖం తరంగితేవ రంగిణః ॥

శ్రీరంగనాథుని సర్వేశ్వరత్వమును చాటునట్టి కిరీటము, శిఖాపట్టము - అను వీనియందలి రత్నములయొక్క వరుస - పైదిశలో కెఱటముల రూపమున ప్రసరించిన ముఖచంద్రునియొక్క (కాంతి) శోభ వలె (ఉన్నది).

**92.** ఈ శ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని కిరీటమును రాజ్యలక్ష్మి విహరించు లీలా పర్వతముగా, చూడామణిని ఆ పర్వతముయొక్క నితంబప్రదేశముగా ఉత్ప్రేక్షించుచున్నారు.

శిఖారత్నోద్దీప్రం దిశి దిశి చ మాణిక్యమకరీ -
లసచ్ఛృంగం రంగప్రభుమణికిరీటం మనుమహే ।
సముత్తుంగస్ఫీతం చిదచిదధిరాజశ్రియ ఇవ
ప్రియాక్రీడం చూడామణి మపి నితంబం తమభితః ॥

అన్ని దిక్కులలోను చూడామణిచే మిక్కిలి ప్రకాశించునది, ఆడుమొసలి రూపములోనున్న మాణిక్యముచే ప్రకాశించుచున్న శిఖరమును (అగ్రభాగమును) కల్గినది అగు శ్రీరంగనాథునియొక్క మణిమయకిరీటమును - చేతనాచేతనములకు నియామకుడైన ఆ భగవానుడు, లక్ష్మీదేవి విహరించు మిక్కిలి ఎత్తైన విశాలమైన (గొప్పదైన), పెద్దదైన, వారికి ప్రియమైన లీలాపర్వతముగా (ఆటవస్తువుగా) తలతుము. ముఖపట్టమున గల రత్నమును కూడ, ఆ పర్వతముయొక్క నితంబ ప్రదేశముగా (తలంతుము).

**93.** ఈ శ్లోకమున శ్రీరంగనాథుని ముఖశోభ ప్రస్తుతమగుచున్నది.

విహరతు మయి రంగిణ శ్చూళికా భ్రమరకతిలకోర్ధ్వపుండ్రోజ్జ్వలమ్ ।
ముఖ మమృతతటాకచంద్రాంబుజ స్మయహరశుచిముగ్ధమందస్మితమ్ ॥

శ్రీరంగనాథుని ముఖమండలము - కేశపాశము, నుదుటియందలి ముంగురులు, తిలకము రూపముననున్న ఆభరణము, ఊర్ధ్వపుండ్రము - అను వీనిచే మిక్కిలి ప్రకాశించునది. అది, అమృతమయమైన చెఱువు, చంద్రుడు, పద్మము-అను వీనియొక్క గర్వమును హరించునట్టిది. తెల్లనైనది, అందమైనది అగు చిఱునవ్వును కల్గినది. ఆ ముఖము నా (మనస్సు)లో విహరించుగాక!

**94.** ఇందు శ్రీరంగనాథుని ముఖమును అరవిందముతో పోల్చుచు భట్టరు వర్ణించుచున్నారు.

ముఖపుండరీక ముపరి త్రికంటకం తిలకాశ్చ కేసరసమాః సమౌక్తికాః ।
ఇహ రంగభర్తు రభియన్మధువ్రతప్రకరశ్రియం భ్రమరకాణి బిభ్రతి ॥

మూడు రేఖలతో కూడిన శ్రీరంగనాథుని ముఖము - అరవిందమువంటిది. దాని పైన గల ముత్యములతో కూడిన తిలకాభరణములు - ఆ పద్మములోని కింజల్కములతో సమానములు. ఆ ముఖములోని ముంగురులు - (ముఖ పుండరీకమునకు) అభిముఖముగా వచ్చుచున్న తుమ్మెదల సమూహమువంటివి.

**95.** శ్రీరంగనాథుని ఫాలమునగల ఊర్ధ్వపుండ్రతిలకమును భట్టరు ఉత్ప్రేక్షాలంకారముతో ఇందు స్తుతించుచున్నారు.

హృదయం ప్రసాదయతి రంగపతేః మధురోర్ధ్వపుండ్రతిలకం లలితమ్ ।
అళికార్ధచంద్రదళసంవలితా మమృతస్రుతిం యదభిశంకయతే ॥

శ్రీరంగనాథుని ముఖములోని ఊర్ధ్వపుండ్రతిలకము, ఫాలభాగము అను అర్ధచంద్రమండలము నుండి (చంద్రఖండమునుండి) ప్రవహించు అమృతప్రవాహమా? అను శంకను కల్గించుచున్నది. శ్రీరంగనాథునియొక్క ఋజువైన (అందమైన), మిక్కిలి భోగ్యమైన, ఊర్ధ్వపుండ్ర రూపములోనున్న ఆ తిలకము (నా) మనస్సును ప్రసన్నము చేయుచున్నది.

**96.** ఇందు శ్రీరంగనాథుని భ్రూ సౌందర్యము వర్ణింపబడుచున్నది.

సరసీరుహే సమవనామ్య మదాదుపరి ప్రనృత్యదళిపంక్తినిభే ।
స్ఫురతో భ్రువావుపరి లోచనయో స్సవిలాసలాస్యగతి రంగభృతః ॥

ఎఱ్ఱని తామరపూవులను పోలు శ్రీరంగనాథుని రెండుకన్నులకు పైన నల్లని తుమ్మెదల వరుసలవలెనున్న కనుబొమల రెండిటి కదలికలను చూడగా, కన్నులనెడి తామరపూలలో గల మకరందమును పరిపూర్ణముగా ఆస్వాదించి, అందువలన నిస్సారములగు వానిని అవలీలగా జయించిన మదమువలన విజయనృత్యము చేయుచున్న నల్లని తుమ్మెదల బారువలె ఉన్నవి.

**97.** ఈ శ్లోకమునందును శ్రీరంగనాథుని భ్రూవిశేషసౌందర్యమును వేరొకచక్కని ఉత్ప్రేక్షతో భట్టరు వర్ణించుచున్నారు.

స్మరశరనళినభ్రమా న్నేత్రయోః పరిసరనమదిక్షుచాపచ్ఛవి ।
యుగముదయతి రంగరాజభ్రువోః గురుకులమివ శార్ఙ్గనృత్తశ్రియః ॥

శ్రీరంగనాథుని రెండు నేత్రములు మన్మథుని బాణములగు పద్మముల భ్రమను కల్గించుచున్నవి. ఆ నేత్రముల సమీపమున వంగుచున్న చెఱకువింటియొక్క కాంతివంటి కాంతిని కల్గిన శ్రీరంగనాథునియొక్క కనుబొమల

జంట, శార్ఙ్గ నర్తనముయొక్క శోభకు పాఠమును చెప్పు ఆచార్యకులమువలె ప్రకాశించుచున్నవి.

**98.** శ్రీరంగనాథుని నేత్రముల వైశాల్యములోని వైలక్షణ్యమును కవి ఈ శ్లోకమున అద్భుతమైన ఉత్ప్రేక్షతో స్తుతించుచున్నారు. నేత్రవర్ణన చేయబడిన మూడుశ్లోకములలో ఇది మొదటిది.

కృపయా పరయా కరిష్యమాణే సకలాంగం కిల సర్వతో-క్షినేత్రే ।
ప్రథమం శ్రవసీ సమాస్తృణీతే ఇతి దైర్ఘ్యేణ విదంతి రంగనేతుః ॥

గొప్పదైన తన దయతో అన్ని అవయవములలోని అన్నిభాగములను నేత్రమయ ముగా చేయబోవునట్టి శ్రీరంగనాథుని నేత్రద్వయము ముందుగా కర్ణద్వయమును వ్యాపించుచున్నది - అని (ఆ స్వామి నేత్రముల) వైశాల్యముచే (అభియుక్తులు) తెలిసికొను చున్నారు.

**99.** ఈ శ్లోకమునకూడ శ్రీరంగనాథుని నేత్రసౌందర్యము స్తుతింపబడుచున్నది.

శ్రవోనాసారోధాత్ తదవధికడోలాయితగతే
విశాలస్ఫీతాయద్రుచిర శఠిరాతామ్రధవళే ।
మిథే బద్ధస్పర్ధస్ఫురిత శఫరద్వంద్వలలితే
క్రియాస్తాం శ్రీరంగప్రణయినయనాబ్జే మయి దయామ్ ॥

చెవులు ముక్కు - అను ఇవి అడ్డగించుటచే వాటివరకు ఊగిసలాడునవి, విశాలమైనవి, పెద్దవి, దీర్ఘములైనవి, పరస్పరము స్పర్ధించునవి, (కనుకనే) ఎగసిపడు (త్రుళ్ళిపడునవి అగు) శఫరములనెడి చేపల జంటవలె మనోహరములైనవి అగు శ్రీరంగనాథునియొక్క పద్మములవంటి నేత్రములు రెండును నాయందు కరుణను చూపుగాక !

**100.** శ్రీరంగనాథుని కటాక్షవైలక్షణ్యమును కవి ఇందు చక్కని రూపకముద్వారా స్తుతించుచున్నారు. పూర్వశ్లోకమున శ్రీరంగనాథుని కన్నులను పద్మములుగా, శఫరములుగా రూపించిన కవి ఇందు ప్రవహించు కృపానదులుగా వర్ణించుచున్నారు.

కరుణామృతకూల ముద్వహైషా ప్రణమత్స్వాగతికీ ప్రసన్నశీతా ।
మయి రంగధనోపకర్ణికాక్ష్ణోః సరితో ర్వీక్షణవీచిసంతతిః స్తాత్ ॥

శ్రీరంగమున గొప్ప సంపదవంటి శ్రీరంగనాథా! కరుణ అను అమృతముతో నిండినవి, ప్రణమిల్లువారికి ఆదరముతో స్వాగతమును పల్కునవి, స్వచ్ఛమైనవి, చల్లనివి చెవులవరకు వ్యాపించియున్నది అగు ఈ (నీ) కన్నులు అనెడి రెండు

నదుల నుండి ప్రవహించు కటాక్షములనెడు ప్రవాహముల వరుస నాపై (దయనీయుడనగు నాపై) ప్రసరించుగాక.

**101.** ఈ శ్లోకమున శ్రీరంగనాథుని నాసిక, మందస్మితము, చుబుకము, కపోలములును వర్ణింపబడుచున్నవి.

విలసతి నాసా కల్పకవల్లీ ముగ్ధేవ రంగనిలయస్య ।
స్మిత మపి తన్నవకుసుమం చుబుకకపోలం చ పల్లవోల్లసితమ్ ॥

శ్రీరంగనాథుని నాసిక అందమైన కల్పలతవలె ప్రకాశించుచున్నది. మందహాసముకూడ ఆ కల్పలత పూచిన క్రొత్తదైన పూవువలె ఉన్నది. చుబుకము (గడ్డము), చెక్కిళ్లు - అను ఇవి చిగుళ్ల వికాసమువలె ప్రకాశించుచున్నవి.

**102.** భుజాగ్రములవరకు తళతళమని మెఱయు శ్రీరంగనాథుని కర్ణాభరణములను కవి మనోహరమైన రూపకాలంకారముతో అభివర్ణించుచున్నారు.

నయనశఫరవిద్ధౌ కర్ణపాశావరుద్ధౌ
రుష ఇవ లుఠతోర్చిర్మంజరీ రుద్గిరంతౌ ।
పరిమిళదళకాళీశైవలా మంసవేలాం
అనుమణిమకరోద్ధౌ రంగధుర్యామృతాబ్ధేః ॥

శ్రీరంగనాథుని ముఖము అమృతసముద్రమువలె ఉన్నది. ఆ ముఖమునకు చుట్టును కదలాడు ముంగురుల సమూహము ఆ సముద్రములోని నాచువలె ఉన్నది. శ్రీరంగనాథుని ముఖమునకు సమీపములగల భుజాగ్రములు ఆ సముద్రముయొక్క తీరమువలె ఉన్నది. ఆస్వామి కన్నులు ఆ సముద్రములోని శఫరములవలె (చేపలవలె) ఉన్నవి. శ్రీరంగనాథుడు తన అందమైన చెవులకు ధరించిన, మణులు పొదిగిన మకర కుండలములు ఆ సముద్రములోని గొప్ప మకరములవలె (మొసళ్ళువలె) ఉన్నవి. ఆ మకర కుండలములు ప్రసరించు గొప్ప కాంతిని చూడగా, స్వామి నేత్రములనెడి చేపలచే తాడనము చేయబడి, గొప్ప పాశములవంటి కర్ణములచే అడ్డగింపబడినవి (బంధింపబడినవి) అగుటచే ఆ కుండలములనెడి మకరములు భుజాగ్రములనెడి తీరమున చేపల వలె పొర్లుచు కోపించినవై తమ కోపమును తేజోరాశుల రూపమున వెడల గ్రక్కునవివలె ఉన్నవి.

**103.** ఇందు భట్టరు శ్రీరంగనాథుని ముఖమును సరస్సుతో రూపణమును సాంగముగా చేయుచు స్తుతించుచున్నారు.

అధరమధురాంభోజం తత్కర్ణపాశమృణాళికా -
వలయ మభి మా మాస్తాం రంగేందువక్త్రసర శ్చిరమ్ ।
నయనశఫరం నాసాశైవాలవల్లరీ కర్ణికా -
మకర మలకశ్రేణీపర్యంత నీలవనావలి ॥

శ్రీరంగనాథుని తిరుముఖము అను సరస్సు - క్రింది పెదవి అనెడి భోగ్యమైన తామర పూవును కల్గినది; కర్ణపాశములు (చెవి తమ్మెలు) అనెడి తామరకాడల సమూహము కల్గినది; నేత్రములనెడి చేపలను కల్గినది; ముక్కు అనెడి నాచు తీగలను కల్గినది; కర్ణభూషణములనెడి సొఱచేపలను కల్గినది; ముంగురుల వరుసలనెడి తీరప్రదేశమున గల నల్లని వనసమూహమును కల్గినది. ఆ సరస్సు చిరకాలము నాకు అభిముఖముగా ఉండుగాక (నన్ను అనుగ్రహించుగాక).

**104.** ముందు రెండు శ్లోకములలో శ్రీరంగనాథుని అమృతసముద్రముగా, సుధాతటాకముగా అనుభవించిన భట్టరు, సముద్రమున కనుపించు శంఖమును సరస్సునకు సమీపమున కనుపించు పోకచెట్టును శ్రీరంగనాథుని కంఠముతో పోల్చుటద్వారా వర్ణించుచున్నారు.

రమయతు స మాం కంఠః శ్రీరంగనేతు రుదంచిత -
క్రముకతరుణగ్రీవాకంబు ప్రలంబమలిమ్లుచః
ప్రణయవిలగల్లక్ష్మీవిశ్వంభరాకరక కందళీ -
కనకవలయక్రీడా సంక్రాంతరేఖ ఇవోల్లసన్ ॥

శ్రీరంగనాథుని కంఠము - దృఢమైన (గొప్పవైన) పోకచెట్టుయొక్క లేలేత తల, శంఖము - అను వీని అతిశయమును (అందమును) అపహరించినది. అనురాగ ముతో ఆలింగనము చేయునట్టి లక్ష్మీదేవి, భూదేవి-అను వీరియొక్క అరటి బోదెలవంటి చేతులలోని బంగారుగాజుల విలాసముచే ముద్రింపబడిన రేఖలను కల్గినదివలె ప్రకాశించుచున్నది. ఆ (విలక్షణమైన) కంఠము నన్ను ఆనందింప జేయును గాక!

**105.** ఈ శ్లోకమునుండి భట్టరు ఆరు శ్లోకములలో శ్రీరంగనాథుని బాహువుల రామణీయకమును స్తుతించుచున్నారు.

అధిష్ఠానస్తంభౌ భువనపృథుయంత్రస్య కమలా -
కరేణో రాలానే అరికరిఘటోన్మాథముసలౌ ।
ఫణీంద్రస్ఫీతస్రక్ వ్యతికరితసందిగ్ధవిభవౌ

భుజౌ మే భూయస్తా మభయ మభి రంగప్రణయినః ॥

శ్రీరంగనాథుని భుజములు, లోకమనెడి పెద్ద యంత్రముయొక్క ఆధార స్తంభముల వలె ఉన్నవి. లక్ష్మీదేవి అను ఆడుఏనుగును బంధించు కట్టుస్తంభములుగా నున్నవి. శత్రువులు అను ఏనుగుల సమూహములను పూర్తిగా నశింప చేయుటలో సాధనములైన రోకళ్లవలె ఉన్నవి. ఆదిశేషునియొక్క శరీరమా? అని, పెద్దదైన పూమాలయా? అని - సందేహించునట్టి గొప్పతనమును కల్గినవి. అవి నాకు, అభయము నొసగును గాక!

**106.** శ్రీరంగనాథుడు ఆదిశేషునిపై పరుండియున్న సన్నివేశమును వర్ణించుటద్వారా ఇందు భట్టరు బాహుద్వయమును పొగడుచున్నారు.

ప్రతిజలధితో వేలాశయ్యాం విభీషణకౌతుకాత్
పున రివ పురస్కర్తుం శ్రీరంగిణః ఫణిపుంగవే ।
సముపదధతః కంచిత్ కంచిత్ ప్రసారయతో భుజ -
ద్వయ మపి సదా దానశ్రద్ధాళు దీర్ఘ ముపాస్మహే ॥

విభీషణునిపట్ల గల కుతూహలము కారణమువలన తిరిగి సముద్రమున కెదురుగా సముద్రతీరమనెడి పడుకను ఆదరించి, అతనిని అనుగ్రహించుట కోసమా? అనునట్లు ఆదిశేషునిపై ఒక భుజమును దిండుగా చేసికొన్నవాడును, వేఱొక భుజమును చాచుకొని యున్నవాడును అగు శ్రీరంగనాథునియొక్క పొడుగైనవి, ఎల్లప్పుడు దానము చేయుటలో ఆదరమును కల్గినవి అగు రెండు భుజములను ఉపాసింతుము.

**107.** ఇంతకు ముందు భట్టరు శ్రీరంగనాథుని ''అర్థికల్పకం'' (76) అనుచు కల్పవృక్షముగా స్తుతించిరి. ఇందు ఆ కల్పవృక్షముకూడ స్వామికి సాటిరాదనుచు స్తుతించుచున్నారు.

కుసుమభరాలసౌ స్ఫటికవేదిశయౌ విటపౌ
అమరతరోః పరం పరిహసత్ పృథురంగభుజః ।
బహుమణిముద్రికా కనకకంకణదోర్వలయైః
కిసలయి దోర్ద్వయం ఫణిని నిర్భరసుప్త మిమః ॥

అనేకములైన రత్నపుటుంగరములు, బంగారుతో చేయబడిన ముంజేతి ఆభరణములు, బాహువుల యొక్క భుజకీర్తులు - అను వీనిచే చిగురించినట్లున్నది. ఆదిశేషునిపై నిర్విచారముగా నిద్రించినది, (కావుననే) పూలతో నిండినదగుటచే

కొంచెము వంగినది, స్ఫటికమయమైన తిన్నెపై పరుండియున్నది, కావుననే కల్పవృక్షము యొక్క శాఖలను రెండిటిని మిక్కిలి పరిహాసము చేయునట్టి, బలిష్ఠమైన శ్రీరంగనాథుని యొక్క బాహువుల జంటను ఆశ్రయింతుము.

**108.** ఈ శ్లోకముకూడ శ్రీరంగనాథుని బాహుయుగమును వర్ణించునదే. ఇందు కవి ముఖ్యముగా వలయబంధము, జ్యాకిణములతో కూడిన స్వామిబాహువుల శోభను చక్కని ఉత్ప్రేక్షతో వర్ణించుట విశేషము.

మద్రక్షావ్రతకౌతుకే సుకటకే విక్రాంతికర్ణేజపే
శార్ఙ్గజ్యాకిణకర్కశిమ్ని సుమనఃస్రక్మోహనే మార్దవే ।
దోర్ద్వంద్వం బహుశః ప్రలోభ్య కమలాలీలోపధానం భవత్
తచ్చిత్రాలకముద్రితం విజయతే శ్రీరంగసంసంగినః ॥

శ్రీరంగనాథుని బాహుయుగ్మము, నన్ను రక్షించుట అను వ్రతమునందు కట్టిన కంకణసూత్రములవంటి చక్కని వలయములను కల్గినవి. పరాక్రమమును సూచించునట్టి శార్ఙ్గమను ధనుస్సుయొక్క అల్లెత్రాడు దెబ్బలచే ఏర్పడిన కాయల (గుర్తుల)తో కాఠిన్యమును కల్గినది. పూమాలయా ఇది! అని భ్రమించునట్టి మృదుత్వమును కల్గినది. లక్ష్మీదేవికి అనేకవిధములుగా ఆశ కల్గునట్లు చేసి, ఆమెకు విలాసార్థమైన దిండుగా అగునట్టిది. ఆ లక్ష్మీదేవియొక్క ఆశ్చర్యకరమైన (మనోహరమైన) ముంగురులచే చిహ్నితమైనది. అట్టి శ్రీరంగనాథుని బాహుయుగ్మము సర్వోత్కర్షతో ప్రకాశించుచున్నది.

**109.** భట్టరు ఈ శ్లోకమున శ్రీరంగనాథుడు తలదిండుగా తన తలక్రింద పెట్టుకొనియున్న భుజమును స్తుతించుచున్నారు. చేతిని తలదిండుగా మడచి పెట్టుకొనునపుడు స్వామి ముఖము ఆ చేయిని తాకుచుండుటచే, ఆ సన్నివేశవిశేషమును భట్టరు హృదయంగమములైన ఉత్ప్రేక్షలతో స్తుతించుచున్నారు.

భవార్తానాం వక్త్రామృతసరసి మార్గం దిశదివ
స్వయం వక్త్రేణేదం వరదమితి సందర్శితమివ ।
కరాంభోజం పంకేరుహవనరుషా పాటలమివ
శ్రయామి శ్రీరంగేశయితు రుపధానీకృత మహమ్ ॥

శ్రీరంగనాథుని పద్మమువంటి చేయి, సంసారమునందు తాపమును పొందిన వారికి శ్రీరంగనాథుని ముఖము అను అమృత తటాకమునకు ప్రవేశించు

మార్గమును ఉపదేశించునదివలె ఉన్నది. "ఈ చేయి వరముల నిచ్చునది" - అని నోటితో తానే చూపించునది వలె ఉన్నది. పద్మముల సమూహముపై గల కోపముచే ఎఱ్ఱగా ఉన్నట్లు ఉన్నది. లక్ష్మీదేవికి శోభిల్లునట్టి తలదిండుగా చేయబడిన ఆ బాహువును నేను ఆశ్రయించుచున్నాను.

**110.** గడచిన అయిదు శ్లోకములతో శ్రీరంగనాథుని బాహుసౌందర్యమును స్తుతించిన భట్టరు, ఇందు సింహావలోకన్యాయమున ఆ వర్ణనను ముగించుచు, స్వామియొక్క రెండుబాహువులను రెండు ఉత్ప్రేక్షలతో ప్రస్తుతించుచున్నారు.

> కిరీటం శ్రీరంగేశయితు రుపధానీకృతభుజో
> విధీశాధీశత్వాత్ ఘటత ఇతి సంస్పృశ్య వదతి ।
> నిహీనానాం ముఖ్యం శరణ మితి బాహు స్తదితరః
> స్ఫుటం బ్రూతే పాదాంబుజయుగళ మాజానునిహితః ॥

శ్రీరంగనాథునిచే తలదిండుగా చేసికొనబడిన భుజము, ఆ స్వామి కిరీటమును తాకి, "బ్రహ్మకు, రుద్రునకు నియామకుడగుటవలన స్వామికి ఈ కిరీటము తగును" అని పలుకుచున్నది. మోకాలివరకు చాచిన ఇంకొక భుజము తామరలవంటి పాదముల జంటను తాకి, "ఇది అధములకు (బ్రహ్మాదులకు) ముఖ్యమగు (శరణము) రక్షకము" అని స్పష్టముగా పల్కుచున్నది. (సర్వోత్కర్షతో ప్రకాశించుచున్నది.)

**111.** లక్ష్మీదేవి భగవానుని వక్షఃస్థలమును నిత్యవాసముగా కల్గియున్నది. కావున అట్టి వక్షఃస్థలమును లక్ష్మీవిలాసగృహముగా రూపించుచు కవి స్తుతించుచున్నారు.

> మలయజశిలిప్తం మాలతీదామతల్పం
> సుమణిసరవితానం కౌస్తుభస్వస్తిదీపమ్ ।
> దనుజవృషవిషాణోల్లేఖచిత్రం చ లక్ష్మీ -
> లలితగృహ ముపాసే రంగసర్వంసహోరః ॥

శ్రీరంగనాథుని వక్షఃస్థలమును లక్ష్మీదేవియొక్క విలాసార్థమైన (గృహముగా) మందిరముగా ఉపాసింతును. అది, చందనము, పచ్చకర్పూరములచే లేపనము చేయబడినది. మొల్లపూవుల పడుకను కల్గినది. గొప్పమణులయొక్క హారములను మేలుకట్టుగా కల్గినది. కౌస్తుభమణి అను మంగళదీపమును కల్గినది. అసురులనెడి ఎద్దులయొక్క కొమ్ముల తాకిడిచే ఏర్పడిన (దెబ్బల గుర్తులు అను) రేఖలతో

అందమైన చిత్తరువులను కల్గినది. అట్టి వక్షస్థలమును ఉపాసింతును.

**112.** శ్రీరంగనాథుని వక్షఃస్థలమును భట్టరు ఇందు మందరపర్వతముచే మథింపబడు క్షీరాబ్ధిగా సావయవరూపకాలంకారముద్వారా స్తుతించుట విశేషము.

హారస్ఫారితఫేన మంశులహరీమాలర్ద్ధి ముక్తాఫల -
శ్రేణీకరదుర్దినం తత ఇతో వ్యాకీర్ణరత్నోత్కరమ్ ।
అవిఃకౌస్తుభలక్ష్మి రంగవసతేః నిస్సీమభూమాద్భుతం
వక్షోమందరమథ్యమానజలధిశ్లాఘం విలోకేమహి ॥

శ్రీరంగనాథుని వక్షఃస్థలము - ముత్యాలహారములు అను విస్తరింపబడిన నుఱుగును కల్గినది. కాంతులు అను కెరటముల వరుసలయొక్క సమృద్ధిని కల్గినది. ముత్యలముల పరంపరలు అను నీటి బిందువులచే దుర్దినమును కల్గినది (నిబిడమైనది). అటు ఇటు (అంతటా) విస్తరించిన రత్నముల సమూహములను కల్గినది. ఆవిర్భవించిన కౌస్తుభమణిని, లక్ష్మీదేవిని కల్గినది. అవధి లేని గొప్పతనముచే ఆశ్చర్యకరమైనది. కావుననే మందరపర్వతముచే చిలుకబడుచున్న సముద్రము యొక్క కీర్తివంటి కీర్తిని కల్గినదానినిగా దానిని సేవింతుముగాక!

**113.** శ్రీరంగనాథుని ఉరమున ప్రకాశించు పరత్వసూచకములైన లక్ష్మీదేవి, తులసిమాల, కౌస్తుభము, వైజయంతీమాలతో పాటు కృష్ణావతారమునకు సంబంధించిన సౌలభ్యసూచకమగు వేరొక ఆభరణవిశేషమును ఇందు భట్టరు వర్ణించుచున్నారు.

వక్షఃస్థల్యాం తులసికమలాకౌస్తుభై ర్వైజయంతీ
సర్వేశత్వం కథయతి తరాం రంగధామ్నః తదాస్తామ్ ।
కూర్మవ్యాఘ్రీనఖపరిమిళత్ పంచహేతీ యశోదా -
నద్ధా మౌగ్ధ్యాభరణ మధికం నః సమాధిం ధినోతి ॥

శ్రీరంగనాథుని వక్షఃస్థలమునందు తులసిమాలిక, లక్ష్మీదేవి కౌస్తుభమణి - అను వీనితో పాటు వైజయంతి అను వనమాల అందటికి ప్రభువై యుండుటను బాగుగా తెలియజేయుచున్నది. ఆ విషయము అటు ఉండుగాక! బాల్యావస్థకు తగిన ఆభరణముగా యశోదాదేవిచే అలంకరింపబడినది, తాబేలుతో ఆడపులియొక్క గోరుతో కూడియున్నది అగు ఆస్వామి ధరించిన పంచాయుధహారము మాయొక్క చిత్తవృత్తిని మిక్కిలి రంజిల్లచేయు చున్నది.

**114.** ఈ శ్లోకమున పూర్వార్ధమున శ్రీరంగనాథుని నడుము సన్నగా ఉండుటకు గల కారణమును, ఉత్తరార్థమున నాభీకమలము విస్తరించి యుండుటకు, నవనవోన్మేషముగా నుండుటకుగల కారణమును కవి ఉత్ప్రేక్షించుటద్వారా స్తుతించుచున్నారు.

**కియాన్ భరో మమ జగదండమండలీత్యతృప్తితః క్రశిత మివోదరం విభోః ।**
**రిరక్షిషోచితజగతీపరంపరాం పరా మివ ప్రథయతి నాభిపంకజమ్ ॥**

**శ్రీరంగనాథుని ఉదరమును చూడగా, అది, "బ్రహ్మాండములయొక్క సమూహము నాకు ఎంతమాత్రము చాలదు" - అను అతృప్తివలన కృశించినదివలె ఉన్నది. నాభీకమలము, రక్షింపవలెనను తన కోరికకు సరిపడు వేఱొక లోకముల వరుసను బయల్పఱచుచున్నదివలె (సృష్టించునట్లు) ప్రకాశించుచున్నది.**

**115.** శ్రీరంగనాథుని ఉదరమునగల వళిత్రయము, నడుమునగల దామోదరత్వ సూచకముగు కిణము, ఉదరబంధమను ఆభరణము అను మూడింటిని కవి చక్కని ఉత్ప్రేక్షలతో వర్ణించుచున్నారు. ఈ శ్లోకము భగవానుని పరత్వసౌలభ్యములను రెండిటిని వర్ణించుచున్నవి.

**త్రివిధచిదచిద్బృందం తుందావలంబి వళిత్రయం**
**విగణయదివైశ్వర్యం వ్యాఖ్యాతి రంగమహేశితుః ।**
**ప్రణతవశతాం బ్రూతే దామోదరత్వకరః కిణః**
**తదుభయగుణాకృష్టం పట్టం కిలోదరబంధనమ్ ॥**

**శ్రీరంగనాథుని ఉదరములోని త్రివళి (మూడు రేఖలు) మూడు విధములైన చేతనాచేతనములయొక్క సమూహమును లెక్కించుచున్నది వలె ఉన్నది. స్వామియొక్క సకల చేతనాచేతనముల నియామకత్వమను ఐశ్వర్యమును వ్యాఖ్యానించుచున్నదివలె ఉన్నది. దామోదరుడను పేరును కల్గించు కణుపు (శరీరమున కాయవలె గట్టిపడిన భాగము) భక్తులకు అతడు అధీనుడగుటను గూర్చి పల్కుచున్నది, ఉదరబంధమను ఆభరణము ఆ రెండు గుణములను (పరత్వ, సౌలభ్యగుణములను), కలిపి కట్టిన పట్టము వలె ఉన్నది.**

**116.** శ్రీరంగనాథుని నాభీపద్మము ఆ స్వామియొక్క పరత్వమును, బ్రహ్మరుద్రాదుల న్యూనతను తెలియజేయుచున్నదనుటను కవి ఈ శ్లోకముద్వారా తెలియజేయుచున్నారు.

**త్రయో దేవా స్తుల్యా స్త్రితయ మిద మద్వైత మధికం**
**త్రికాదస్మాత్ తత్త్వం పర మితి వితర్కాన్ విఘటయన్ ।**

విభోః నాభీపద్మో విధిశివనిదానం భగవతః
తదన్యభ్రూభంగీపరవదితి సిద్ధాంతయతి నః ॥

బ్రహ్మ, విష్ణువు, శివుడు-అను ముగ్గురు దేవతలు సమప్రాధాన్యమును కలవారు (అని), ఈ త్రిమూర్తులు ఒక్కటే (అని), ఈ త్రిమూర్తులకంటె గొప్పదైన తత్వము (మాత్రమే) గొప్పది అని - ఈవిధమైన విప్రతిపత్తులను (ఊహల)ను పోగొట్టుచు, శ్రీరంగనాథుని నాభీకమలము బ్రహ్మకు, రుద్రునకు భగవానుడు మూలకారణ మగుటను, ఆ భగవానుని కంటె వేఱయిన చరాచరప్రపంచమంతయు (ఆ భగవానుని) కనుబొమల కదలికలకు పరతంత్రము అగుటను మనకు సిద్ధాంతీకరించుచున్నది.

**117.** ఇందు భట్టరు శ్రీరంగనాథుని నాభిని, నాభీకమలమును కలిపి అనుభవించుచున్నారు.

గర్భే కృత్వా గోప్తు మనంతం జగదంతః
మజ్జత్భ్రమ్యా వాంఛతి సామ్యం నను నాభిః ।
ఉత్క్షిప్యైతత్ ప్రేక్షితు ముద్యద్భ్రమిభూయం
నాభీపద్మో రంహతి రంగాయతనాబ్ధేః ॥

సముద్రమువంటి శ్రీరంగనాథుని బొడ్డు - అంతు లేని లోకములను కడుపున ఉంచుకొని, రక్షించుటకు లోపల మునుగుచున్న సుడితో పోలికను కోరు చున్నది కదా! నాభీపద్మము - ఈ లోకములను పైకి లేవనెత్తి చూచుటకై పైకి వృద్ధిచెందుచున్న సుడివలె ఉన్నది.

**118.** ప్రస్తుతశ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని ఊరుయుగమును వర్ణించుచున్నారు.

మద మివ మధుకైటభస్య రంభాకరభకరీంద్ర కరాభిరూప్యదర్పమ్ ।
స్ఫుట మివ పరిభూయ గర్వగుర్వోః కిముపమిమీమహి రంగకుంజరోర్వోః ॥

మధుకైటభుల మదమును (అణచిన విధము) వలె, అరటిబోదెలు, కరభ ప్రదేశము, గొప్ప ఏనుగు తొండము - అను వీనియొక్క గర్వమును అవమానించి, అందువలన కల్గిన గర్వముచే గొప్పవి అగు కుంజరమువంటి శ్రీరంగనాథునియొక్క తొడలకు ఏ వస్తువును స్పష్టముగా ఉపమానముగా పల్కుదుము? (దేనిని పలుకలేమని భావము).

**119.** శ్రీరంగనాథుని నడుము, పీతాంబరముల కలయికయొక్క సొబగును గొప్పఉపమద్వారా

భట్టరు స్తుతించుట ఈశ్లోకమునందలి ప్రత్యేకత.

కటీకాంతిసంవాది చాతుర్యనీవీలసద్రత్నకాంచీకలాపానులేపమ్ ।
మహాభ్రంలిహన్మేరుమాణిక్య సానూరివాభాతి పీతాంబరం రంగబంధోః ॥

శ్రీరంగనాథుని నడుమున శోభిల్లు పీతాంబరము గొప్ప కాలమేఘమును మధ్యలో కల్గిన మేరుపర్వతసానువువలె ప్రకాశించుచున్నది. ఇచట కాలమేఘము శ్రీరంగనాథుడే. ఆ స్వామి నడుముచుట్టునుకల పీతాంబరము ఆ నల్లని మేఘమును మధ్యన గల మేరు పర్వతసానువు. నీవి అనగా-వస్త్రబంధము (ముడి). స్వామి వస్త్రబంధము నడుము కాంతితో తులతూగు శోభను కల్గినది. ఆ నీవియందు వెలుగొందు రత్నమయమేఖలా భరణముచే (మొలనూలుచే) పీతాంబరము చుట్టబడియున్నది. నీవీబంధము నడుము శోభతో తులతూగుట అనగా ఏమి? అనినచో నీవీబంధము అనునది నిజమునకు లేకున్నను, స్వామి నడుముయొక్క కాంతి నీవీబంధమువలె శోభిల్లుచున్నదని భావము.

**120.** ఈశ్లోకమునందును భట్టరు శ్రీరంగనాథుని పీతాంబరమును మూడు ఉత్ప్రేక్షలతో వర్ణించుచున్నారు.

భర్మస్థలాంశుపరివేష ఇవాంబురాశేః
సంధ్యాంబువాహనికురుంబ మివాంబరస్య ।
శంపాకదంబక మివాంబుముచో మనో నః
పీతాంబరం పిబతి రంగధురంధరస్య ॥

శ్రీరంగనాథునియొక్క పీతాంబరము (పచ్చని పట్టువస్త్రము) - సముద్రముయొక్క సువర్ణమయమైన ప్రదేశము యొక్క కాంతియొక్క పరిధి వలె ఆకాశముయొక్క సంధ్యాకాలమునందలి మేఘముయొక్క మండలము (సమూహము) వలె మేఘము యొక్క మెఱపు తీగలయొక్క సమూహము వలె ఉన్నదియై మన మనస్సును పానము చేయుచున్నది.

**121.** ఇందు శ్రీరంగనాథుని మోకాళ్లను రెండిటిని కవి ఉత్ప్రేక్షించుచున్నారు.

వైభూషణ్యాం కాంతి రాంగీ నిమగ్నా విష్వగ్వీచీ క్వాపి సోన్మాదవృత్తిః ।
జానే జానుద్వంద్వవార్తావివర్తో జాత శ్రీమద్రంగతుంగాలయస్య ॥

శ్రీరంగమను గొప్ప ఆలయమును కల్గిన శ్రీరంగనాథుని ఆభరణముల

కాంతిలో మునిగిన ఆస్వామి అవయవముల శోభ అంతట వ్యాపించినదై, ఒకచోట, ఉన్మాద వ్యాపారముతో కూడినదై (క్షోభమును పొందినదై), రెండు మోకాళ్లు - అను చెప్పు రీతిలో రెండు సుడులుగా అయినది - అని తలంతును.(శ్రీరంగనాథుని మోకాళ్ళు రెండు సుడులవలె ఉన్నవి.)

**122.** శ్రీరంగనాథుని పిక్కలు (జంఘలు) ఇందు వర్ణింపబడుచున్నవి.

శ్రీరంగేశయజంఘే శ్రీభూమ్యామర్శహర్షకంటకితే ।
తత్కేళినళినమాంసల నాళద్వయలలిత మాచరతః ॥

లక్ష్మీదేవి, భూదేవి చేయు పాదసంవాహనము వలన కల్గిన ఆనందముతో శ్రీరంగనాథుని పిక్కలు గగుర్పాటును పొందినవై, ఆలక్ష్మీదేవియొక్క, భూదేవి యొక్క విలాసముకొఱకైన రెండుతామరపూల యొక్క బలిసిన రెండు కాడల విలాసమును కలిగి యున్నవి.

**123.** పాదములు ఎఱ్ఱగా ఉండుట సహజము. శ్రీరంగనాథుని పాదములు ఎఱ్ఱగా ఉండుటకు ఇందు భట్టరు మనోహరమైన హేతువులను ఉత్ప్రేక్షించుచు, స్తుతించుచున్నారు.

వందారుబృందారకమౌళిమాలా యుంజానచేతఃకమలాకరేభ్యః ।
సంక్రాంతరాగా వివ పాదపద్మౌ శ్రీరంగభర్తుః మనవై నవై చ ॥

నమస్కరించు దేవతల కిరీటముల వరుసలు, యోగుల మనస్సులు, లక్ష్మీదేవి కరములు - అను వీనినుండి సంక్రమించిన (సోకిన) ఎఱ్ఱని రంగును కల్గినవి వలె ప్రకాశించుచున్న శ్రీరంగనాథునియొక్క పద్మములవంటి పాదములను ధ్యానింతును స్తుతింతును కూడ.

**124.** శ్రీరంగనాథుని పాదద్వంద్వమును శ్లోకద్వంద్వముతో స్తుతింపనెంచిన భట్టరు ఇందు మొదటగా పాదముల మాహాత్మ్యమును ఆఱు గొప్పవిశేషణములతో ప్రతిపాదించుచున్నారు.

యత్ బృందావనపండితం దధిరవైః యత్తాండవం శిక్షితం
యల్లక్ష్మీకరసౌఖ్యసాక్షి జలజప్రస్పర్ధిమానర్ధి యత్ ।
యద్భక్తేష్వజలస్థలజ్ఞ మపి యద్దూత్యప్రసంగోత్సుకం
తద్విష్ణోః పరమం పదం వహతు నః శ్రీరంగిణో మంగళమ్ ॥

శ్రీరంగనాథుడను విష్ణువుయొక్క పాదము బృందావనమున

సంచరించుటలో సమర్థమైనది. ఆ పాదము నర్తనవిశేషము (గొల్ల వనితలు) పెరుగు చిలుకునపుడు వచ్చు శబ్దముచే శిక్షింపబడినది. ఆ పాదము లక్ష్మీదేవి చేతులయొక్క (చేతులవలన కల్గిన) సౌఖ్యమునకు సాక్షి అయినది. ఆ పాదము తామరపూవుతో కలహించునట్టి సౌందర్యముయొక్క అతిశయమును కల్గినది. మఱియు, ఆ పాదము భక్తుల విషయమున ఎత్తు పల్లములను (హెచ్చు తగ్గులను) ఎఱుగదు. ఆ పాదము భక్తుల కొరకు దౌత్యమును కొనిపోవు సందర్భమునందు ఆసక్తిని కల్గినది. ఆ గొప్పదైన పాదము మనకు క్షేమమును నిర్వహించునుగాక!

**125.** ''వజ్రధ్వజాంకుశసుధాకలశ'' (4) ఇత్యాదిగా కూరేశులు అతిమానుషస్తవమున స్తుతించిన రీతిలో భట్టరు ఈశ్లోకమున శ్రీరంగనాథుని పాదపద్మములను స్తుతించుచు, నమస్కరింతుమనుచున్నారు.

శింజానశ్రుతిశింజినీమణిరవైః వజ్రారవిందధ్వజ -
చ్ఛత్రీకల్పకశంఖచక్రముకురైః తై స్తై శ్చ రేఖామయైః ।
ఐశ్వర్యేణ జయం త్రివిక్రమముఖం ఘుష్యద్భి రామ్రేడితమ్
శ్రీరంగేశయపాదపంకజయుగం వందామహే సుందరమ్ ॥

శ్రీరంగనాథుని నూపురములందున్న మణులు చేయు ధ్వనులు- సర్వేశ్వరత్వముతో మూడు పాదములతో స్వామి లోకములను విక్రమించుట మొదలగు విజయములను పలుమార్లు ఘోషించుచున్న వేదరవములవలె ఉన్నవి, రేఖల రూపములో నున్న ఆయా వజ్రము, పద్మము, పతాకము (ధ్వజము), గొడుగు, కల్పవృక్షము, శంఖము, చక్రము, దర్పణము - అను గుర్తులను కల్గినవి అగు అందమైన శ్రీరంగనాథుని యొక్క పద్మముల వంటి ఆ పాదముల జంటను నమస్కరించుచున్నాము.

**126.** ఇందు శ్రీరంగనాథుని పాదములను, నఖకాంతులను భట్టరు ఉత్ప్రేక్షించుచున్నారు.

పునాని భువనాన్యహం బహుముఖీతి సర్వాంగుళీ -
ఝలత్ ఝలితజాహ్నవీ లహరిబృందసందేహదాః ।
దివా నిశి చ రంగిణః చరణచారుకల్పద్రుమ -
ప్రవాళనవమంజరీ నఖరుచీ ర్విగాహేమహి ॥

శ్రీరంగనాథుడు ఒక అందమైన కల్పవృక్షము. ఆ స్వామి కాలివేళ్లు చిగుళ్ల వంటివి. ఆ చిగుళ్ళలో పూసిన కొత్త పూలగుత్తుల వలె ఆ గోళ్ల కాంతులున్నవి.

వాటిని చూడగా, "నేను పెక్కు ప్రవాహములను కల్గినదాననై లోకములను పావనము చేయుదును" అని స్వామి కాలివ్రేళ్లు అన్నిటినుండి ఝలఝలమని శబ్దముతో ప్రవహించు గంగానది లోని కెరటములయొక్క వరుసలా ఇవి! అనుసందేహమును కల్గించుచున్నవి. అట్టి ఆ కాంతులలో రాత్రింబగళ్ళును నేను అవగాహింతును.

**127.** భట్టరు ఇంతవరకును ద్వయములోని పూర్వార్ధమునకు వివరణరూపముగా పూర్వశతకమును రచించిరి. గురుంపరావందనముతో ప్రారంభించి ''శ్రీస్తనాభరణం తేజః'' (8) అను శ్లోకమున సంగ్రహముగా భగవదాశ్రయణమొనర్చిన భట్టరు తరువాతి శ్లోకమునుండి క్రమముగా ద్వయమంత్రములోని పూర్వఖండార్థమును వివరించిరి. చివరిగా ఈశ్లోకమున మరల క్లుప్తముగా పూర్వఖండార్థమును ప్రతిపాదించుచు శతకపరిసమాప్తిని చేయుచున్నారు.

శ్రీరంగేందోః పదకిసలయే నీలమంజీరమైత్ర్యా
వందే వృంతప్రణయిమధుపవ్రాతరాజీవజైత్రే ।
నిత్యాభ్యర్చానతవిధిముఖ స్తోమసంశయ్యమానైః
హేమాంభోజైః నిబిడనికటే రామసీతోపనీతైః ॥

ఇంద్రనీలరత్నములతో చేయబడిన నూపురములతో, తొడిమయందు చేరిన యున్న తుమ్మెదల సమూహమును కల్గిన తామరపూవును జయించినవి, ఎల్లప్పుడు ఆరాధనలో నమస్కరించిన బ్రహ్మయొక్క ముఖముల సమూహమా ఇది? అని సందేహింపబడునవి, శ్రీరామునిచే, సీతాదేవిచే సమర్పింపబడిన బంగారు పద్మములతో సాటివచ్చునవి అగు, చంద్రునివంటి శ్రీరంగనాథుని చిగుళ్లవంటి పాదములను రెండింటిని నమస్కరింతును.

రంగరాజస్తవే పూర్వశతకం వ్యవృణోదిదమ్ ।
దాసః శ్రీశింగరాచార్యః స్వాచార్యకరుణాబలాత్ ॥

శ్రీరంగరాజస్తవము - పూర్వశతకము సంపూర్ణము.



## శ్లోక అకారాది సూచిక

